" కథతోపాటు అంతరార్థం తెలిస్తే, పురాణాలని ఎవరైనా నిందిస్తూంటే విని ఊరుకోలేం. సరైన సమాధానాన్ని చెప్పి ప్రాచీన ఋషుల ఆశీస్సులని పొందగలం".
ఈ భావంతో వ్రాయబడిన డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావు రచనలు

శ్రీమద్ వాల్మీకి రామాయణాయనమ్

1. బాలకాండము(కథ మరియు విశేషాంశాలతో)(2వ ముద్రణ) 40-00
2. అయోధ్యాకాండము (కథ మరియు విశేషాంశాలతో)(2వ ము.) 35-00
3. సుందరకాండము(నిత్య పారాయణానికి వీలుగా కూడ)(3వ ము.)50-00
4. ఉత్తరకాండము (కథ మరియు విశేషాంశాలతో) 40-00
5. తుండము నేకదంతమును (వినాయకుని సర్వవిశేషాలూ వినాయక వ్రత కల్పమూ కథా అర్థాలతో) (2వ ముద్రణ) 10-00
6. శ్రీ లలితా సహస్రపూజా నామమంత్రార్థ వివరణం (2వ ము.) 35-00
7. శ్రీ మద్భాగవతమూ అంతరార్థ సౌందర్యమూ 45-00
8. మాంగల్య తంతునానేన (పెళ్లిమంత్రాలకి అర్థమూ విశేషాంశాలూ) (3వ ము.) 40-00
9. శ్రీ విష్ణు సహస్రనామమూ అంతరార్థరూపమూ 45-00
10. అనగనగనగా . . . . . .(కొన్ని ప్రాచీన శ్లోకాలూ-వాటి వెనుక దాగిన కథలూ - పిల్లలకీ పెద్దలకీ కూడా కథారసాయనం) 15-00

355-00

1. పై సెట్టు మొత్తం కావలిస్తే రు 330/-కు, రిజిస్టర్డ్ బుక్‌పోస్టు చార్జీలు మేమే భరించి పంపిస్తాం.
2. మూటికి మించి పుస్తకాలు కావలిసివస్తే మీకు పోస్టు చార్జీల ఖర్చులేదు సరికదా 10% మినహాయింపు సౌకర్యం కూడ.

:1998 మార్చి 31 నాటికి సిద్ధమయ్యే గ్రంథాలు :

11. ఆరణ్య కాండము 45-00
12. కిష్కింధా కాండము 45-00
13. యుద్ధ కాండము 60-00
14. పండుగలూ - అంతరార్థమూ - కర్తవ్యమూ 50-00

**: ప్రతులకు :**

**☎ 0863 - 354611**

**5-21-37, 2/6, బ్రాడిపేట, గుంటూరు - 2.**
**పిన్ : 522 002** (A.P.) INDIA.

# అనగనగా......

(ప్రాచీన శ్లోకాల వెనక దాగిన ఇరవైనాలుగు కథల సంపుటి)

 

: రచన :

'రామాయణ ప్రవచన సుధాకర'

'రామాయణ సుధానిధి'

'భాషా ప్రవీణ'


**డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావు**

ఎం.ఏ., (తెలుగు), ఎం.ఏ., (సంస్కృతము), పిహెచ్.డి.,

5-21-37, 2/6 బ్రాడీపేట, గుంటూరు - 2.


   

: ముద్రింపించిన ఉదారులు :

చిరంజీవి **కందికుప్ప సాయి శివ నారాయణ** స్మృతికి

తండ్రి

**Lt. Col. K.R. MURTY (Retd.)**

Off Shore Hook-up & Construction (INDIA) Pvt. Ltd.

305 VVC Complex, Dr. C.G. Road,

**MUMBAI - 74.**

Ph : (R) 7570074, (O) 5569241.

Message : 2673995/2675884

**Rs. 20/-**

# కంచికి చేరని కథ......

**సాయిబాబూ !**

కలలో సాయినాథుడు కన్పడ్డాడని నీకు ఆ పేరుని పెట్టుకున్నాను.

చల్లారు ముద్దుగా........ మురిపాల మూటగా........ గారాబంగా........ ఇలాటి
అన్నింటికీ అర్థాన్ని నిన్ను పెంచడం ద్వారా స్వానుభవంతో
తెలుసుకున్నాను.

అతికష్టమైన జపాన్ భాషని ఆ దేశం తీసుకెళ్లినపుడు ఒకటిన్నర రోజుల్లో
నువ్వు నేర్చుకుని ఆశ్చర్యపరిచినప్పుడు **పొంగిపోయాను.**

ఎనిమిదోతరగతిలోనే ఎనభయ్యోపడి మేధావుల భావాలని
ఆంగ్లభాషలో కవిత్వంలో చెప్తూంటే 'నా పుత్రుడ'ని **గర్వపడిపోయాను.**

బామ్మ ఒళ్లో కూచుని భారత రామాయణ భాగవతాలని నువ్వు
వింటున్నప్పుడు **పొంగిపోయాను.**

ఒకసారి నువ్వే రామునిగా, మళ్లీ నువ్వే ఒకసారి వాలిగా - అలాగే
ఒకసారి కబంధునిగా, మళ్లీ ఓసారి రామచంద్రునిగా - పరకాయ
ప్రవేశం చేసి నటిస్తూంటే చూసి **అబ్బురపడిపోయాను.**

బాబూ ! ఒక్కగానొక్కడివి కదా ! అనీ
నువ్వు **నాలుక్కాలాలపాటు** ఉంటావనీ
బంధువులు **నలుగురినీ** ఆనందింపచేస్తావనీ
దేశం **నాలుగు చెరగులా** కీర్తి ప్రతిష్ఠలని తెస్తావనీ
ఎన్నో ఎన్నో ఊహల దుప్పటిని కప్పుకుని నేనుంటే
సరిగా పదేళ్ల కిందట
**ఆ నాలుగో నెలలో నాలుగో తేదీని**
పడగెత్తిన పాముల్లా కన్పించే ఆ రెండు నా(లు)గులు కలిసిన 88 (4-4-88) లో
**ఎందుకయ్యా ! అలా వెళ్లిపోయావు !**
**ఏమనయ్యా ! అలా నన్నేడిపిస్తున్నావు !**

అనకూడదేమో కాని ఈ సారైనా ఆయుష్మంతునిగా పుట్టు. లేదా నన్ను నీకంటె ముందు వెళ్లేలా చెయ్యి.

బుద్ధిగా బల్లమీద కూచుని ఉత్సాహంగా చదువుకుంటూండే ఏ పిల్లవానిలోనైనా ఒక్క క్షణం అలా చేరి నీ పేరిట ఉన్న దీన్లోని ఏ ఒక్క కథనైనా- ఒక్క వాక్యాన్నైనా-నువ్వు చదవకపోతావా ? అని ఈ వెఱ్ఱి నాన్న ఆశ !

- కె.ఆర్. మూర్తి.



చి॥ కందికుప్ప సాయి శివ నారాయణ

జననం : 22-6-1971 పరమపద గమనం : 4-4-1988

న చ స్మ వృద్ధా బాలానాం ప్రేత కార్యాణి కుర్వతే !

రామరాజ్యంలో తమ పిల్లలు గతించడాన్ని ఏ తలిదండ్రులూ ఎరగరుట. అందుకని ఆ రామాశీర్వచనంకోసం త్వరలో శ్రీమద్రామాయణ యుద్ధకాండని నీ పేరున ప్రకటింపచేస్తున్నాను.

- కె.ఆర్. మూర్తి

# విషయసూచిక

| క్రమసంఖ్య | విషయము | పుట |
|---|---|---|
| 1. | గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణుః .......... అనే ఈ శ్లోకం వెనకున్న కథ ఇదా ? | 1 |
| 2. | నన్ను పొగడని నాన్నని చంపేస్తాను ! (సహసా విదధీత న క్రియామ్) | 8 |
| 3. | ఆ శ్లోకం నన్ను రక్షించింది ! | 11 |
| 4. | నా గణితశాస్త్ర బలంతో దైవాన్నే జయిస్తాను ! | 13 |
| 5. | ఈ లెక్కద్వారా భారతకథ తెలుస్తోందా ? (సంస్కృతంలో లెక్కల శ్లోకం) | 15 |
| 6. | ఆ శ్లోకాలే నన్ను దొంగని చేసాయి ! | 18 |
| 7. | నా చెంబుపోయిన విధం బెట్టి? దనిన ............ | 21 |
| **8.** | **పుత్రుని ఋణం తీరితే ఏమౌతుంది?** | 23 |
| 9. | ఒక కార్యాన్ని సాధించాలంటే ఏం కావాలి? | 27 |
| 10. | ఓసి 'రండా!' నేనెవర్ని ? | 30 |
| 11. | చందనంలా చల్లబడ్డాడు అగ్ని ! | 31 |
| 12. | వినాయకుని బొడ్డులో వేలు ఊడి రాలేదా ? ఎందుచేత ! | 32 |
| 13. | భోజుని భవనం - వ్యాకరణ పిశాచ గృహప్రవేశం ! | 34 |
| 14. | నలుగురు మహాకవులు చెప్పిన శ్లోకం ! | 36 |
| 15. | దొంగలైనా వీరికి శిక్ష లేదుట ! | 37 |
| 16. | కాశీ వెళ్లినవారంతా అన్నంభట్టు లౌతారా ? | 40 |
| 17. | మహాపండితుల చదువు 'మొదట్లో చట్టు బండలే !' | 43 |
| 18. | డబ్బుకోసం పిల్లలు తల్లిని చంపారా? | 45 |
| 19. | లక్ష్మీ ర్మే భజతు ! (సంపద నాకు లభించుగాక !) | 47 |
| 20. | అంతటి ఆదిశంకరుల కష్టాన్నే గట్టెక్కించిన స్తోత్రం ! | 49 |
| 21. | నాకు తెలిసిందిదే ! | 49 |
| 22. | జగన్నాథ పండితుని చివరిపుట ! | 53 |
| 23. | బుద్ధిం తు సారథిం విద్ధి ! (బుద్ధియే నిజమైన సారథి) | 60 |
| 24. | అమరుడు నిజంగా 'అ-మరుడే' ! | 63 |

# అనగనగా .....

ఏ ఇతర ధ్యాసా లేకండా సాహిత్య సమారాధనమే తమ జీవిత లక్ష్యంగా భావించి, ఎన్నెన్నో కావ్యాలనీ పురాణాలనీ ఇతిహాసాలనీ భద్రంగా మనకి అందించిన సంస్కృతమహాకవులు ఎందరో ఎందరెందరో ఉన్నారు. ఈ రోజున మన అభిప్రాయాన్ని మనం ఒక చక్కని శైలిలో సూటిగా చెప్పగలుగుతున్నామన్నా, అసలు అలా చెప్పగల ధోరణంటూ ఒకటుందని మనకి తెలిసిందన్నా, ఆ చెప్పేది కూడా ఎదుటి వారికి నచ్చేలా చెప్పగలుగుతున్నామన్నా అదంతా ఆ ప్రాచీన మహాకవుల రచనల చలవే.

మహాకవులైన వాళ్ళక్కూడా మనలాగానే బాల్యం, యౌవనం, వృద్ధాప్యం .... వంటివి ఉండనే ఉంటాయి కదా ! ఆయా వయసుల్లో వాళ్లు చేసిన చిలిపి పనులూ, వాళ్ల వాళ్ల సరదాల్లో సౌరభాలూ, కష్టాలూ-ఎన్నో, అలా శ్లోకాల రూపంలో శాశ్వతమై కన్పిస్తూ ఒక్కో శ్లోకం మనకి ఒక్కో కథాచిత్రాన్ని మన ముందుంచుతుంది. అంతేకాదు. ఆ శ్లోకం మనకి ఓ జీవిత సత్యాన్ని ఉపదేశించి పక్కకి జరిగిపోతుంది. అలాటి పనికొచ్చే కథాశ్లోకాలని కొన్నింటిని చూద్దాం.

## 1. ఈశ్లోకం వెనుక ఉన్న కథ ఇదా ?

**గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః।**
**గురు స్సాక్షా త్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః॥**

ఈ శ్లోకాన్ని ద దాపుగా వినని వారుండరు గాని ఈ శ్లోకం వెనుక ఉన్న కథని మాత్రం చాల తక్కువమంది విని ఉంటారు.

**అనగనగా** ఒక ఆశ్రమంలో సమర్థుడైన ఒక గురువు ఉండేవాడు. ఆయన సర్వశాస్త్రపండితుడైనా జ్యోతిషంలో దిట్ట అనిపించుకున్న మేటి. ఎందరో శిష్యులు సంవత్సరాల తరబడి ఆయన వద్ద శిష్యరికం చేసి చదువు అయిపోగానే వెళ్లిపోతూండేవారు. అందరి లాగానే గురువుగారి వద్ద సర్వశాస్త్రాలతో పాటు కౌత్సుడనే శిష్యుడు కూడా జ్యోతిషాన్ని విశేషంగా అభ్యసించాడు. అందరితోపాటు ఇతనికీ చదువు ముగిసింది. ఇక రెండురోజులలో స్నాతక సభ -అంటే - చదువుముగిసిన రోజున గురువు నుండి వీడ్కోలు తీసేకునే సభ- జరగబోతోంది. ఆ సమయంలో గురువు అవసరమైన పనిమీద పొరుగూరు వెడుతూ ఆశ్రమ నిర్వహణ బాధ్యతని కౌత్సునిపై పెట్టి వెళ్లాడు.

రెండ్రోజులు కాగానే గురువు రావలసి ఉన్నా పొరుగూరికీ తన ఆశ్రమానికీ మధ్య తోవలో ఉన్న ఏఱు పొంగి రాక పోకలకి అభ్యంతరం ఏర్పడడంతో మఱో మూడు రోజులు ఆలస్యంగా ఆశ్రమానికి వచ్చాడు గురువు. తానుంటే ఆశ్రమం ఎలా నడుస్తుందో అలాగే సరిగా ఏ సమయానికి ఏవేవి ఎలా జరగాలో అలాగే కౌత్సుని నిర్వహణలో మఱో మూడురోజులపాటు కూడా ఆశ్రమకార్యక్రమాలన్నీ సక్రమంగా జరిగినందుకు పరమ సంతృప్తి చెందాడు గురువు.

స్నాతక సభ ప్రారంభమైంది. ఒక్కొక్కరూ తమ తమ మీద గురువు చూపిన వాత్సల్యాన్ని ఆనంధబాష్పాలతో చెప్తూ ఆయనకి సాష్టాంగపడి ఆశీర్వచనాన్ని తీసుకుని వెళ్లిపోతున్నారు. కౌత్సుడు మాత్రం సభలో ప్రసంగించలేదు సరికదా గంభీరంగానూ మౌనంగానూ ఉండిపోయాడుకూడ.

అందఱు శిష్యులూ వెళ్లిపోయారు వారి వారి ఇళ్లకి. కౌత్సుని తలిదండ్రులు వచ్చి ఇంటికి రావల్సిందిగా కోరినా అతను తిరస్కరించాడు. దానితో వాళ్లు గురువుకే ఈ విషయాన్ని విన్నవించారు. కౌత్సుణ్ణి పిలిచి కారణం అడిగాడు గురువు.

కౌత్సుడు బోరున విలపిస్తూ 'ఆచార్యా ! మీరు పొరుగూరు వెళ్లిన రెండ్రోజులూ తాము నేర్పిన జ్యోతిష విద్యతో 'తమ జాతకాన్నే' పరిశీలించి చూచాను. స్వామీ ! రాబోయే కార్తిక మాసంనుండి - అంటే మఱో పదిహేను రోజుల్లో - తమకి దారుణమైన కుష్ఠవ్యాధి రాబోతోందని మీ గ్రహస్థితి చెప్తోంది. నాకు చదువుని చెప్పి నా జీవితానికి తిండిని పెట్టిన మీరు, ఇంతటి భయంకర వ్యాధితో బంధువులకీ స్నేహితులకీ కూడా దూరంగా ఉంటూ కాలం గడపవలసి వస్తూంటే, నేను సుఖంగా ఎలా మా ఇంట్లో ఆనందించ గలను ?

అయినా ఈ మీ జీవిత కష్టాన్ని ముందే చెప్పి ఉంటే, తగిన జపాన్నో మంత్రాన్నో ఉపాసననో మేమంతా కలిసి చేసి వ్యాధిరాకుండా చేసుండేవాళ్లం గదా ! ఆచార్యా ! ఈ కారణం కారణంగా మీరు స్వస్థతని పొంది ఆశ్రమానికి వచ్చిన మీదటే ఇంటికి వెడతాను' అన్నాడు.

గురువుకి ఆశ్చర్యం ఆనందం దుఃఖం ఆనంద బాష్పాలూ ఒకేసారి కలిగాయి. ఇంతమంది శిష్యులున్నా ఏ ఒక్కరికీ ఇలాంటి ఆలోచన కలగలేదు. అలాగని ఈ కుష్ఠవ్యాధి విషయాన్ని చాల మంది శిష్యులకి చెప్పినా, తనకి సపర్య చేయడం, నచ్చకపోవచ్చు. లేదా వారెలాగో 'సరే' అని అన్నా, వారి ´ండ్రులు వ్యతిరేకించవచ్చు.

ఇలాంటి సందర్భంలో నోరు తెఱచి తన అనారోగ్యాన్ని పదిమందిలో చెప్పుకుని, ఎవరూ రానిష్టపడని దశలో అవమానపడడం కంటె మౌనంగా ఉండడం శ్రేయమని తాను ఊరుకొనడం జరిగిందనే ఈ విషయాన్ని సవివరంగా కౌత్సునికి చెప్పాడు. అయినా కౌత్సుడు మాత్రం గురువుతోనే ఉండగలనని ఖండితంగా చెప్పాడు. అప్పటికి మూడు రోజులనుండీ రావలసిందని బ్రతిమలాడుతున్న కౌత్సుని తలిదండ్రులు, కౌత్సుడు రాననడంతో చేసేది లేక నిరాశతో ఇంటి ముఖం పట్టారు.

ఇక కౌత్సుడు, తన గురువుని అనేక ప్రశ్నలని గుప్పించి ఏకారణంగా ఆ వ్యాధి బాధని అనుభవించకుండా తప్పిపోతుందో ఆ విషయాన్ని తన పాండిత్యంతో బాగా ఆలోచించి చెప్పవలసిందిగా కోరాడు.

ఎంతెంతో ఆలోచించి, ఎన్నెన్నో గ్రంథాలని తిప్పి నిరాశతో గురువు 'కౌత్సా! ప్రారబ్దం భోగతో నశ్యేత్తని ఒకవాక్యం ఉంది. గుర్తుందిగా ?' ఏదో జన్మలో చేసిన పాపఫలం, తర్వాతి జన్మల్లో పుణ్యాలని చేయని కారణంగా తగ్గక, ఈ జన్మపాపాలతో కలిసి ఇదిగో - రాబోయే వ్యాధిగా మాఱింది. నా ప్రారబ్ధాన్ని అనుభవించి పుణ్యాత్ముణ్ణి కాబోతున్నానని నేనానంద పడుతూంటే, నువ్వు నాకోసం దుఃఖించడం సరికాదు. నువ్వడిగిన అన్ని ప్రశ్నలకీ నా వద్ద సాధికారికమైన సమాధానాలున్నాయి. అయితే అవన్నీ వివరించే సావకాశం లేదు.

కాబట్టి సారాంశం చెప్తాను విను. ఈ వ్యాధి బాధని నేను పడక తప్పదు. పైగా బాధపడితేనే బాగుండునని నేను కోరుకుంటున్నాను. కుష్ఠవ్యాధితో ఇంట్లోనే ఉంటూ ఆ రోగాన్ని మఱెవరికో అంటగట్టడం కంటె 'ఈ ఉపాధ్యాయ వృత్తిని ఇంత కాలం చేసి ఎందఱికో నా విద్యని చెప్పి ఉన్న కారణంగా గురు ఋణ విముక్తుడినే!' అని ఆనంద పడుతూ ఆశ్రమం నుండి నిష్క్రమించడం మంచిదనే నిర్ణయానికి వచ్చాను' అని నిర్ద్వంద్వంగా చెప్పేసాడు.

దానికి కౌత్సుడు "గురువర్యా ! కాశీ నగరంలో పుణ్యాన్ని చేసినా పాపాన్ని చేసినా యముడు దాన్ని రెట్టింపుగా లెక్కిస్తాడట. తాము కాశీనగరానికి వెళ్లి అక్కడ పుణ్యకార్యాలని ప్రారంభిస్తే ఆ పుణ్యం రెట్టింపై, పూర్వం చేసుకున్న పుణ్యంతో కలిసి మూడింతలై 'ఏ పాపం కారణంగా ఈ భయంకర వ్యాధి కల్గిందో, ఆ పాపఫలం తగ్గి, వ్యాధి కూడ మఱింత శీఘ్రంగా నివారింపబడవచ్చునని గ్రంథాలలో ఉం'దని మీరే ఒకప్పుడు చెప్పగా విన్నాను.

కాబట్టి రెండు సంవత్సరాల పాటు పడవలసిన వ్యాధి బాధని సంవత్సర
పడేందుకు వీలుగా కాశీకి ప్రయాణమౌదా" మని గురువుని బలవంతపె
కాశీకి చేర్చాడు కౌత్సుడు.

ముందుగా అనుకున్నట్టుగానే ఆయనకి కుష్ఠం ప్రార
తన గురువు ద్వారా కొందఱు శిష్యులకి ఉచితంగా చదువు చెప్పించ
ఎక్కువ సంఖ్యలో శివపంచాక్షరీ మంత్ర జపాన్ని చేయించడం, .... వం
పుణ్యకార్యాలని దాదాపు ఆఱు నెలలపాటు చేయించాడు కౌత్సుడు.
వ్యాధి ముదిరింది.

ఇక గురువుకి కౌత్సుడు చెప్పే ఏ పుణ్యకార్యమూ
మానివేసింది. వ్యాధిబాధ కారణంగానూ, తనకి ఇలాటివ్యాధి వచ్చిందనే
దుఃఖం కారణంగానూ కోపం పెరిగిపోసాగింది. తన వెంట వచ్చిన
నిష్కారణంగా నిందించడం, ఒక్కోసారి చేతిలో ఏవస్తువుంటే దాన్ని విసి
వంటివి కూడ ప్రారంభించాడు గురువు.

ఆవ్యాధి బాధ కొద్దిగా ఉపశమించిన వేళలో తన తః
గ్రహించేవాడు. అయినా అంతలోనే మళ్లీ మఱచిపోతూండేవాడు. తనని
ఒక్కోసారి కొడుతున్నా కూడా శిష్యుడు మాత్రం ఎంతో ఓర్పుతోనే ఉ
గురువు వద్ద. కారణం 'తనకి సంపూర్ణ విద్యని నేర్పినవాడు ఆయన కా
నిందిస్తున్న దానికి కారణం వ్యాధి మాత్రమే' అని అనీను.

మిట్ట మధ్యాహ్నపు ఎండలో కాళ్లకి చెప్పులు కూ
కాశీ నగరంలో జోలి పట్టుకు తిరిగి అన్నాన్ని తెచ్చి ఆయన వద్ద పె
తాపు తన్ని తనకి కూడా అన్నాన్ని లేకుండా చేసిన సంఘటనలు కౌ
ఆర్నెలలలో ఎన్నో ఉన్నాయి. విశేషించి ఒక నెల నుండి మఱీను.

ఈ పరిస్థితిని గమనించిన బ్రహ్మవిష్ణు మహేశ్వరు
తాము ఒక పందెం వేసుకున్నారు.

'మహా గురుభక్తి పరుడైన ఆ శిష్యుణ్ణి, ఎవరు
నుండి పంపిస్తారో వారు మనలో గొప్పవారు' అనేది ఆ పందెం స్వరూ

అటుప్రక్క కౌత్సుడు చెప్పరాని కష్టానికి గుఱి
దేవతలకిది వినోద కాలమా ? అని అనిపిస్తుంది. సామాన్య దృష్టితో

లో భావం అది కాదు. చేతిమీద ఒక పుండు ఏర్పడిందనుకుందాం. ఆ భాగాన్ని ఏ వేలితో సన్నగా తాకినా ప్రాణం పోయినంత నొప్పిగా ఉందని కూడ అనుకుందాం. ఆ విషయాన్ని వైద్యునికి చెప్పాం కూడ. కాని, ఆయన వెంటనే 'నొప్పి ఎక్కడ ?' అని అంటూ, అదే భాగాన్ని మఱింత గట్టిగా నొక్కి చూస్తాడు. ఎందుకని ? మనమీది కోపంతోనా ? కాదు. మనని స్వస్థులని చేయడానికే.

అలాటిదే ఇక్కడి దైవపరీక్ష కూడ. కౌత్సుడు దేవతల చేత పరీక్ష పెట్టబడదగిన స్థాయికి వచ్చాడనే విషయాన్ని ఇక్కడ గమనించాలి. తగినంత ప్రతిభ కలిగినవాడైనప్పుడే కదా అలాటి దేవతల పరీక్షకి అర్హుడయ్యేది.

త్రిమూర్తులూ నిర్ణయించుకున్న ప్రకారం ముందుగా మాఱు వేషంలో బ్రహ్మ వచ్చి 'నాయనా! కాశీ నగరానికి నువ్వు వచ్చిందగ్గర్నుండి చూస్తున్నాను. నిష్కారణంగా నిందలూ శిక్షలూ పడుతూ ఉండడం కంటె - పెద్ద వాణ్ణి చెప్తున్నా విను- మఱో గురువుని ఆశ్రయించి మీది విద్యాభ్యాసాన్ని కొనసాగించ రాదూ!' అన్నాడు.

కౌత్సుడు బ్రహ్మని ఎగాదిగా చూసి 'అయ్యా! గురువుని - అందునా ఇలాటి బాధతో ఉన్నవారిని-విడిచివెళ్లిపోవలసిందిగా చెప్పే మీరు నాకు 'పెద్దలు' ఎలా ఔతారు? ఇదే పరిస్థితిలో తాముంటే తమ శిష్యుణ్ణి వెళ్లిపొమ్మని అనగలరా ?' అంటూ ప్రారంభించేసరికి బ్రహ్మ చేసేదిలేక వెనుదిరిగాడు.

మరి కొంత సేపయాక విష్ణువు మాఱువేషంలో వచ్చి 'శిష్యుడా! రోగంతో ఉన్న గురువుని సేవించడం ధర్మమే సుమా ! అందుకని నిన్ను చాల మెచ్చుకుంటున్నాను. అయితే చేసిన మేలుని మఱచే కృతఘ్నునికి చేసే సహాయం బూడిదలో పోసిన పన్నీరు వంటిది కావడమే కాక, దాని వల్ల పాపం కూడ వస్తుంది. ఎందుకంటావా? ఈ కృతఘ్నుణ్ణి సేవించే సమయాన్ని మఱో విష్ణు సంకీర్తనానికి ఉపయోగిస్తే పుణ్యం వస్తుంది కూడా గదా ! గమనించు ! ఇప్పటికైనా నష్టపోయే పుణ్యాన్నీ, పొందుతున్న పాపాన్నీ తలచుకుని వెళ్లిపో !' అన్నాడు.

కౌత్సుడు వినయంతో నమస్కరించి 'స్వామీ! చేసిన మేలుని మఱచే కృతఘ్నుణ్ణి గుఱించి తామింతవరకూ సెలవిచ్చారు గదా ! ఏదైనా కృతఘ్నత ఉంటే అది ఈ గురువు సేవని విడిచి వెళ్లిన పక్షంలో నాలో ఉంటుందేమో గాని, ఆ గురువులో కాదు. తనయింట భోజనాన్ని పెట్టి తన చదువు మొత్తాన్ని నిస్స్వార్థంగా నాకు చెప్పిన ఈ గురువుకి సేవచేయడం కంటె కృతజ్ఞత

ఏముంటుంది? వీరిని ఈ దశలో విడిచిపోవడానికి మించిన కృతఘ్నత ఏముంటుంది ? పెద్దలైన తాము సదుపదేశాన్ని ఇయ్యాలిగాని ఇలాటి మాటలు కాదు' అని ముగించాడు కౌత్సుడు. విష్ణువు సిగ్గుతో తలవంచుకున్నాడు.

మహేశ్వరుని వంతు వచ్చింది. 'కౌత్సా ! మానవ సేవ మాధవ సేవతో సమానం కావచ్చేమో గాని , ఇలా చీత్కారాలని పొందుతూ సేవించడం మాత్రం సరికాదు. మరో విషయాన్ని ఆలోచించు. తనకి వ్యాధి బాధ ఉంటే తనవరకూ భోజనాన్ని మానవచ్చేమో గాని , నువ్వు కూడా తినే వీలు లేకుండా అన్నాన్ని నేలపాలు చేయడం ధర్మ మౌతుందా ? ఈ మాసంలో ఎన్ని సార్లు ఆయన నీ అన్నాన్ని కూడా నేలపాలు చేయలేదు ? ఎన్ని రోజులు నువ్వు ఉపవాసం చెయ్యలేదు ? ఆలోచించుకో! ఇలాటివారిని కొన్నాళ్లు తమ బాధని తాము పడనిస్తే మన విలువ తెలుస్తుంది కాబట్టి నా మాటవిని - పూర్తిగా కాదుగాని- 'కొంత కాలం పాటు చెప్పకుండా వెళ్లిపో ఎక్కడికైనా!' అన్నాడు శివుడు.

శిష్యుడు సాష్టాంగపడి లేచి 'మహానుభావా ! తిండికి లేక బాధపడే నాకు తిండి పెట్టడమే కాక ఈ జీవిత మంతా తిండిని పొందగల వీలునిచ్చే విద్యని ఇచ్చాడు ఈ గురువు. ఆయన అన్నాన్ని నేలపాలుచేసిన కారణంగా మాసంలో ఏ రెండు మూడు రోజులో నాకు తిండి లేకపోతున్న మాట నిజమే గాని, ఇంటి వద్ద ఉండి ఉంటే నాకు నెలరోజుల పాటూ ఈ తిండి కష్టసాధ్యమే కదా !

అదీకాక కొన్ని సంవత్సరాల పాటు ఉచితంగా భోజనాన్ని పెట్టి నా శరీరాన్ని వృద్ధి చేసిన నా గురువుకి రెండు మూడు రోజుల పాటు నన్ను ఉపవసించేలా చేసే హక్కు కూడా ఉంది. అయ్యా ! నాదో చిన్న విన్నపం విని నాకు సహాయం చేయరూ!' అనగానే శివుడానందపడి ముందుకు వచ్చాడు.

'అయ్యా ! మీరూ తమకు ముందు మరో ఇద్దరూ వచ్చి నా ఏకాగ్రతని భంగం చేస్తూ గురుసేవకి అభ్యంతరాన్ని కల్గిస్తున్నారు. దయచేసి మరెవరినీ కూడా ఇలా ఉపదేశించడానికి రానీయకుండా ఇక్కడే మీరుండి నాకు సహాయపడరూ ?' అన్నాడు కౌత్సుడు. మహేశ్వరునికి ఇక మాట రాలేదు.

కొంత సేపటికి బ్రహ్మావిష్ణుమహేశ్వరులు ముగ్గురూ తమ తమ వేషాలలో ప్రత్యక్షమై 'చిన్నవాడా ! మేమ్ముగ్గురం సృష్టిస్థితి లయాలని చేసే త్రిమూర్తులం. నిన్ను పరీక్షించాం. నెగ్గావు. ఆనందంతో నీకు మోక్షాన్ని ఈయగలం కాబట్టి నీకు మోక్షాన్ని ప్రసాదించదలచి వచ్చాం. నీ గురుభక్తి అపారం' అన్నారు.

దానికి కౌత్సుడు సాష్టాంగపడి ప్రణామం చేసి 'ఆర్యులారా ! మోక్షాన్ని ఈయ గలవారు త్రిమూర్తులే అని నేనూ విన్నాను గాని స్వయంగా తాము రావడాన్ని ఊహించనూ లేదు - ఎప్పుడూ చూడనూ లేదు.

నా అదృష్టం కొద్దీ మోక్షం నా వద్దకి తరలి వచ్చింది కాబట్టీ, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మాత్రమే మోక్షాన్ని ఈయగలరు కాబట్టీ, నాకు ఆ గురువే బ్రహ్మ. ఆగురువే విష్ణువు. ఆ గురువే మహేశ్వరుడు. ఆ గురువే ఈ ముగ్గురినీ సృష్టించిన పరబ్రహ్మం కూడా.

నేనే మోక్షానికి అర్హుణ్ణని మీకు అనిపిస్తే, నాకు ఆ అర్హతని కలగ జేసిన మా గురువు ఏ విధంగానూ అనర్హుడు కానట్లే గదా ! నాకు ఆ గురువు మోక్షాన్ని ఎలాగూ ఈయగలరు. అందుకని తాము మోక్షాన్ని మా గురువుగారి కీయండి.!' అన్నాడు.

కౌత్సుని గురుభక్తికి మెచ్చి, ఇంతటి గురుభక్తి ఉన్నందుకు కౌత్సునికీ, ఇలా ఈ శిష్యుణ్ణి తీర్చిదిద్దినందుకు ఆ గురువుకీ, మొత్తానికి ఆ గురు శిష్యులిద్దరికీ మోక్షాన్నిచ్చారు త్రిమూర్తులు.

ఇలాటి కథలని వింటే గురుశక్తి మనకి బోధపడుతుంది. ఒక పనిని పూర్తి చేయడానికి అత్యంత ముఖ్యం, అతిముఖ్యం, ముఖ్యం అని కారణాలు మూడుగా ఉంటాయి.

ఉదాహరణకి అన్నాన్ని వండుకోవాలంటే బియ్యం అత్యంత ముఖ్య కారణం. నీరూ, పాత్రా, నిప్పూ అనేవి అతిముఖ్యకారణం. వండే విధానం తెలియడం ముఖ్యకారణం.

అలాగే ఒక ఉద్యోగాన్ని సంపాదించగలిగి సుఖంగా జీవిస్తున్నామంటే గురువులు చెప్పిన విద్య అత్యంత ముఖ్యకారణం. మన శ్రద్ధ క్రమశిక్షణ అనేవి అతిముఖ్యకారణం. ఆ గురువు చెప్పిన చదువు మన బుద్ధికి పట్టేలా చేయగల బుద్ధినిచ్చిన తల్లిదండ్రులు ముఖ్యకారణం.

ఇలాటి జ్ఞానం మనకి అలవడిన రోజున 'నా సొంతంగా పైకి రాగలిగాను. నా కృషి వల్లనే నాకు ఉద్యోగం వచ్చింది ...' వంటి అహం (నేను...) కారపు వాక్యాలు ఏవ్యక్తికీ రావు.

## 2. నన్ను పొగడని నాన్నని చంపేస్తాను !

**అనగనగా** 'భారవి' అనే విద్యార్థి ఉండేవాడు. అతను చిన్నప్పటినుండీ మంచి కవిత్వాన్ని చెప్తూండేవాడు. అతని కవిత్వాన్ని విన్నవాళ్లంతా అతణ్ణి మెచ్చుకోవడమే కాక అతని తండ్రితో కూడ ఆ విషయాన్ని ముచ్చటిస్తూండేవారు. భారవి తండ్రి మాత్రం వారి ప్రశంసని వింటూనే 'ఏదో మా వెఱ్ఱినాగన్న తోచీతోచనిది చెప్తే, దాన్ని కవిత్వమంటూ మీరు కూడా పొగిడితే ఎలా ? వాడూ - వాడికో కవిత్వమూనా ?' ... అంటూ తేలికగా అంటూండేవాడు.

తన పుత్రుణ్ణి తాను పొగడకూడదనీ, అలా పొగడడం పుత్రునికి ఆయుఃక్షీణతని కలుగజేస్తుందనీ ఆయన అభిప్రాయం తప్ప, భారవి చెప్పే కవిత్వంలో గొప్పదనం లేదనేది కాదు. తన పుత్రుని కవిత్వాన్ని ఇతరులు చెప్పగా పూర్తిగా విని, భారవి కవిత్వం కొత్త పుంతలు తొక్కుతోందని మనసులో ఆనందపడుతూ, ఆ విషయాన్ని తన భార్యతో అనేక పర్యాయాలు చెప్పాడు కూడా - అయితే రహస్యంగానూ, ఎవరూ వినకుండానూ మాత్రమే.

తనని ఊరంతా మెచ్చుకోవడం, తన తండ్రి మాత్రమే తనని తన ఊరివారిముందే తీసిపారేసినట్టు మాట్లాడ్డం భారవికి చాల కష్టంగా అన్పించింది. ఒకనాడది తారస్థాయికి చేరింది. తండ్రిపీడని శాశ్వతంగా వదిలించుకోవాలనుకున్నాడు భారవి.

అంతే ! ఫలితంగా ఒక బండఱాతిని అటక మీదికి చేర్చుకుని కూచున్నాడు. తన తండ్రి భోజనం చేస్తున్నవేళ, ఆ బండఱాతిని ఆయన నెత్తిపై పడేలా వేయాలనేది భారవి పథకం. ఈ విషయాన్ని గమనించిన భారవితల్లి మాత్రం ఏమీ ఎఱుగనట్టుగానే ఉండిపోయింది.

భారవితండ్రి భోజనానికి విస్తరిముందు కూచోగానే పైనున్న భారవిక్కూడా వినిపించేలాగా ఆమె 'ఏమండీ భారవి ఇంట్లో లేడు! కాబట్టి అడుగుతున్నాను. నిజాన్ని సూటిగా నాకు చెప్పండి. ఊళ్లోవాళ్లంతా వాడి కవిత్వాన్ని మెచ్చుకుంటూంటే ఎందుకని మీరు వాణ్ణి-వాడి కవిత్వాన్నీ-వాళ్ల ఎదురుగుండానే చులకన చేస్తూ తీసిపడేస్తున్నారు ? వాడి పసిమనసు ఎంతో గాయపడుతోందని నాకు అన్పిస్తోంది' అని అంది.

అటక మీద బండలాతిని పట్టుకుని ఉన్న భారవి, తన తండ్రి సమాధానాన్ని విన్న మీదట ఏంచేయాలో నిర్ణయించుకుందామనుకున్నాడు.

భారవి తండ్రి తన భార్యవంక చూస్తూ 'ఏమే ! మనింటి చెట్టుకి పండిన పండు చాల రుచిగా ఉందని అంతా అంటూంటే 'కాదు చేదుగా ఉం'దని నేనెందుకంటున్నానో నీకు మాత్రం తెలియదా ? ఎప్పుడూ నువ్వు ఈశ్లోకాన్నే వినలేదా ?'

**'ప్రత్యక్షే గురవ: స్తుత్యా: పరోక్షే మిత్రబాంధవా: ।**
**కా ర్యాంతే దాసభృ త్యాద్యా: న తు పుత్రా: కదాచన ॥'**

'గురువుగారి పాండిత్యానికి సంతోషపడిన శిష్యుడు ఎవరైనా ఆయనని ఆయన సమక్షంలోనే పొగడాలిట. ఇక మిత్రుల ఔదార్యాన్నీ, బంధువుల ఆదరణనీ వారి పరోక్షంలోనే చెప్పుకోవాలిట. అంటే, మనం మనమిత్రుల బంధువుల పరోక్షంలో వాళ్లగూర్చి ఏది అనుకుంటామో, అది వారిమీద మనకున్న నిజమైన అభిప్రాయ మౌతుందట. చెప్పిన పనిని పూర్తి చేసుకుని వచ్చాక మాత్రమే దాసులనీ, నెలసరి జీతంమీద పనిచేసే భృత్యులనీ పొగడాలిట.

ఇలా ఎప్పుడో ఒకప్పుడు పై వారినందరినీ ఎలాగో ఒకలాగ పొగడవచ్చుటగానీ, తాము కన్న సంతానాన్ని మాత్రం ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ పొగడనే పొగడరాదట. ఇదిగో ఇలా మనసులోనే పరమానంద పడుతూ ఉండాలిట. నా ఆనందాన్ని నీకు మాత్రం అప్పుడప్పుడు చెప్పలేదా ? ఈ రోజు ఎందుకో వింతగా అడుగుతున్నావుగానీ' అన్నాడు.

ఈ మాటలు వింటూ ఆమె ఉబ్బితబ్బిబ్బవుతూంటే మళ్లీ ఆయనే **'పిల్లవాడి బాగుకోరిన ఏ తండ్రీ కూడా, వాణ్ణి వాడి ఎదురుగా పొగడదు-పొగడ కూడదు కూడ.**

ఈ వయసులో వాడికి మహాపండితుణ్ణనే అహంకారం వస్తే వాడికిక విద్యాగంధం అబ్బక భ్రష్టుడై పోతాడు. **'పుత్ర శ్శత్రు రపండిత:' లోకంలో** ఏ తండ్రికైనా నిజమైన శత్రువెవరంటే చదువురాని పుత్రుడేనటే' అంటూ భోజనాన్ని ముగించాడు.

ఈ మాటలని వింటూనే భారవి చెప్పలేని బాధతో అటకదిగి తండ్రికి సాష్టాంగపడి, ఆయన పాదాలని కన్నీటితో కడిగేసాడు. తాను చేయదలచిందంతా సవివరంగా చెప్పి తన తప్పుకి శిక్షని విధించవలసిందిగా తండ్రిని ప్రార్థించాడు.

భారవిలో పశ్చాత్తాపబుద్ధి కలిగినందుకెంతో సంతోషపడిన తండ్రి ' ఈ సంఘటనని దృష్టిలో పెట్టుకుని ఒక శ్లోకాన్ని చెప్పవలసిం'దన్నాడు. అంతే! క్షణంలో ఆశువుగా భారవి ఈ శ్లోకాన్ని చెప్పాడు.

**సహసా విదధీత న క్రియామ్ అవివేకః పరమాపదాం పదమ్।**

**వృణుతే హి విమృశ్యకారిణం గుణలబ్ధాః స్వయమేవ సంపదః॥**

"ఏ పనినీ తొందర పాటు నిర్ణయంతో చేయకూడదు. 'తొందర' క్షణికావేశాన్ని కలిగిస్తుంది. ఆ క్షణికావేశం కారణంగా వ్యక్తి అవివేకి అవుతాడు. ఆ అవివేకం అనేక ఆపదలకి నిలయం. బాగా ఆలోచించి పనిచేసేవాణ్ణే సర్వశుభాలూ సంపదలూ వరిస్తాయి " అనే అర్థం కల ఈ శ్లోకాన్ని విని, భారవి తండ్రి మఱింత ఆనందపడి శిక్ష ముగిసిందన్నాడు భారవితో.

అయినా భారవి వినకుండా తన తప్పుకి ఏమైనా శిక్షని విధించ వలసిందేనని తండ్రిని పట్టుబట్టాడు. 'అయితే అత్తవారింటిలో ఆర్నెలలుండి రావలసిం'దని అన్నాడు తండ్రి. భారవికి అదొక శిక్ష అనిపించకపోయినా తండ్రిమాట ప్రకారం మర్నాడే భార్యతో అత్తవారింటికి వెళ్లాడు.

పండితుడూ-మంచికవిగా పేరొందినవాడూ-అందునా కొత్తల్లుడూను-అంటూ అత్తింటి వారు మొదట వారంరోజులూ భారవిని కాలు కిందపెట్టనీయలేదు.

రెండోవారం చూసీచూడనట్టు వ్యవహరించారు.

మూడోవారం 'పనీపాటాలేక ఊరికే తినిపోదామని వచ్చినవాడు'గా తనని గూర్చి గుసగుసలాడారు.

నాలుగో వారానికి ఆమాట అననే అన్నారు.

ఐదోవారానికి ఇంటిపనీ, పొలంపనీ, ఇంటికి వచ్చి పోయే చుట్టాలపక్కాల మర్యాదలూ ..... ఇలా అప్పగించడం మొదలెట్టారు.

భర్తకి జరుగుతున్న ఈ అవమానం తనకేమాత్రమూ పట్టినట్టనిపించలేదు భారవి భార్యకి. అత్తారింటిలో ఆర్నెలలుండడంలో 'శిక్ష' ఎంత దాగుందో రోజురోజుకీ తెలియ సాగింది భారవికి.

మొదటివారంలోని మీగడపెరుగూ పిండివంటల భోజనం క్రమంగా మూడోవారానికి మజ్జిగా ఆవకాయగా మాఱి, ఆఱో నెల ప్రారంభానికి

గంజి నీళ్ల స్థాయికి చేరింది. ఈ తిండికి తోడు అసమర్థుడూ, మేసేపోతూ, తిమ్మరాజూ వంటి బిరుదులని కూడ భారవి ఓర్పుతో భరించి ఆర్నెలలు నిండిన మఱురోజే బయలు దేరుతూ తన రాకకి కారణాన్ని అత్తగారితో చెప్పి తండ్రి వద్దకి వచ్చి సాష్టాంగపడ్డాడు.

కన్నీటితోనే తల్లిదండ్రులిద్దఱూ భారవిని దీవించారు. మహాకవి కాలిదాసు రచించిన రఘువంశం, మేఘసందేశం, కుమారసంభవం అనేమూడు కావ్యాలు-మాఘమహాకవి రాసిన శిశుపాలవధాకావ్యం, ఈ భారవి రాసిన కిరాతార్జునీయం అనే కావ్యంతో కలిపి మొత్తం ఈ ఐదింటినీ సంస్కృతంలో పంచకావ్యాలు అంటారు.

అలా సంస్కృతంలో ఏ అయిదు కావ్యాలని చదివితే భాష కరతలామలకమౌతుందో, ఆ పంచకావ్యాల్లో ఒకటైన కిరాతార్జునీయాన్ని రచించి, భారవి శాశ్వతుడయ్యాడు.

## 3. ఆ శ్లోకం నన్ను రక్షించింది.

అత్తారింటిలో ఉంటున్న కాలంలో, తనకంటూ ఓ సంపాదన లేని కారణంగా భారవిచేతిలో చిల్లిగవ్వకూడా లేకపోయింది. అదే సమయంలో పండక్కి తన భార్యకి చీర తేవలసివచ్చింది కూడ. దిక్కుతోచక, తానురాసిన 'సహసా విదధీత న క్రియామ్ ..... ' అనే శ్లోకాన్నే ఒక తాటాకు మీద రాసి ఆ శ్లోకాన్ని ఆ ఊళ్లోనే ఒక వ్యాపారి వద్ద కుదువ పెట్టాడు భారవి.

ఆ సొమ్ముతో అప్పటికి పరువు నిల్చింది. ఆ తాకట్టు (కుదువ)ని విడిపించుకునేంతవరకూ ఆ శ్లోకాన్ని ఏ గ్రంథంలోనూ ఏ సభలోనూ భారవి చెప్పకూడదు సరికదా, ఆ శ్లోకాన్ని ఇంతకుముందు విన్న ఎవరైనా చదివినా అది తన శ్లోకమేనని అనకూడదు కూడా. అదీ నియమం.

ఆ శ్లోకాన్ని కుదువ పెట్టుకున్న బేహారి ఆ రాత్రే వ్యాపార నిమిత్తం పొరుగు దేశానికి బయలుదేరుతూ ' ఆ శ్లోకం ఇంటి చూరులో ఉందనీ, భారవి సొమ్మిచ్చినప్పుడు ఆ తాటాకుని ఆయనకిచ్చి వేయవచ్చు'ననీ భార్యకి చెప్పి వెళ్లాడు. ఆ వ్యాపారి బయలుదేరేనాటికి అతని భార్య రెండవ నెల గర్భవతి.

వ్యాపారంనిమిత్తం వెళ్లిన బేహారి పన్నెండు సంవత్సరాలకి తిరిగి వచ్చాడు. ఉత్తర ప్రత్యుత్తరాలు రాసుకునే వీలు ఏమాత్రమూ లేని ఆ కాలంలో,

వెళ్లిన వ్యక్తి తిరిగి వస్తేనే అతడు జీవించి ఉన్నట్టు లెక్క. పన్నెండేళ్లయిన కారణంగానూ, తాను వెళ్లేనాటికి 'తన భార్య గర్భవతి' అనే మాటని మఱచిన కారణంగానూ, తన ఇంట్లో ఒంటరిగా ఉండే భార్యకి తాను తెచ్చిన నగలని వెంటనే చూపించి ఆనందపరచాలనే ఉద్దేశ్యంతో ఆఅర్ధరాత్రివేళలోనే ఓడదిగి ఇంటికి తిన్నగా చరచరా వచ్చాడు వ్యాపారి.

ఆరు బయట పంచలో తన భార్య పక్కలో వేఱొకడు పడుకొని ఉండడాన్ని చూసిన వ్యాపారికి-కోపం, ద్వేషం-ఒక్కసారి మిన్నుముట్టాయి. 'తాను దూరంగా ఉన్న కారణంగా ఈమె ఇంతటి నీచానికి దిగజాఱిం'దని అర్థమైన వ్యాపారి, తన ఒరలోని కత్తిని దూసి ఆమె తలమీద వేయడానికి పైకెత్తగానే, ఆ కత్తి మొన ఇంటిచూరుకి తగిలి, అక్కడ దాచి ఉంచిన భారవి శ్లోకం రాసి ఉన్న తాటాకు నేలన పడింది.

చూరునుండి పడింది ఒకతాటాకని అర్థమయింది వ్యాపారికి. దీపం వెలుగులో దానిలో ఏముందో చదివాడు.

'సహసా విదధీత న క్రియామ్....' 'తొందరపాటు నిర్ణయంతో ఏ పనినీ చేయకు. ఆలోచించి చేసిన పని ద్వారా సకలశుభాలూ సంపదలూ చేకూరుతాయి' అనే అర్థం ఉన్న ఆశ్లోకం కనిపించింది.

అంతే ! అప్పట్లో తను పెట్టుకున్న కుదువా...... తన విదేశీప్రయాణం.... ఆమె అప్పటికి గర్భవతిగా ఉండడం.... అన్నీ గుర్తుకి రావడమేకాక, తాను బయలుదేరేప్పుడు గర్భవతిగా ఉన్న తన భార్య, ఈ పిల్లవాణ్ణి ప్రసవించి ఉండి ఉంటుందని కూడా క్షణాల్లో అర్థమైపోయింది.

కత్తిమొనకి ఈ తాటాకే తగిలి నేలన పడి ఉండకపోతే, ఎంత దారుణం జరిగి ఉండేది! కన్నీళ్లు ధారగా కారుతుంటే భార్యాపుత్రుల్ని లేపి జరిగింది చెప్పి తన తప్పుని మన్నించవలసిందన్నాడు వ్యాపారి.

మఱునాడే సకుటుంబంగా భారవి ఉన్న గ్రామానికి వెళ్లిన వ్యాపారి, భారవిని విశేషంగా సత్కరించి "తనకుటుంబాన్ని నిలపడానికి 'శ్రీరామ రక్ష' అయిన ఆ శ్లోకం ఎందఱినో తొందరపాటు నుండి రక్షించగల"దని పలికి భారవి ఆశీస్సులని పొందాడు.

**దీనితో భారవీ ఆయన శ్లోకమూ కూడ చిరస్థాయి అయినట్లే కదా !**

ఎన్నో ఔషధాలలో ఏదో ఒక ఔషధం, ఎందరో రోగులలో ఎవరో ఒకరోగి మీద, ఎప్పుడో ఒకప్పుడైనా వికటించ వచ్చునేమో కాని, ఇలాటి శ్లోకాలు ఎప్పుడూ ఎవరికీ హానిని కల్గించనే కల్గించవు. అందుకే ఆ కవుల చరిత్ర శాశ్వతం. వారి ప్రతి అక్షరం నిత్యసత్యం.

## 4. నా గణిత శాస్త్ర బలంతో దైవాన్నే జయిస్తాను.

**అనగనగా** 'భాస్కరాచార్యుడు' అనే పేరుగల గణితశాస్త్రవేత్త ఉండేవాడు. నేడు మనం చదువుకునే గణితశాస్త్రాన్ని, అందునా విశేషించి బీజగణితాన్ని (ఆల్జీబ్రా) అందరికీ అర్థమయ్యే తీరులో ఎప్పుడో రాసినవాడు ఈ భాస్కరాచార్యుడే. ఈయన రాసిన లెక్కల గ్రంథం పేరు 'లీలావతీ గణితం'.

సహజంగా గ్రంథ కర్తగా ఎవరుంటే వారిపేరునే ఆ గ్రంథానికి పెట్టడాన్ని మనం చూస్తాం. ఇక్కడ భాస్కరాచార్యుడు తన గణిత గ్రంథానికి, తన పేరుని కాక తన కూతురైన లీలావతి పేరుని పెట్టడం వెనుక ఒక విషాదాత్మక కథ ఉంది. వివరంగా చూద్దాం.

గణిత శాస్త్రంలో మహాపండితుడైన భాస్కరాచార్యుడు, జ్యోతిష శాస్త్రానిక్కూడా ప్రాణం వంటిదైన గణితం ద్వారా జ్యోతిషశాస్త్రాన్ని ఆపోశన పట్టడమే కాక-తనకు ఒక్కగానొక్క కూతురైన లీలావతి పుట్టిన సమయాన్ని బట్టి ఆమె జాతకాన్ని స్వయంగా పరిశీలించి-అవాక్కైపోయాడు. 'తన కూతురికి వివాహమైన మర్నాడే విధవరాలయ్యే యోగం' జ్యోతిషం బట్టి సుస్పష్టంగా కన్పిస్తోంది. 'ఎలా ఈ కష్టాన్ని దాటాలి?' అని తీవ్రంగా ఆలోచించాడు భాస్కరుడు.

పండితులందరితోనూ చర్చించి ఒక నిర్ణయానికి వచ్చి, ఏ ముహూర్తంలో పెళ్లిని చేస్తే లీలావతికి ఏవిధంగానూ వైధవ్యయోగం పట్టనే పట్టదో, అలాంటి ముహూర్తాన్ని నిర్ణయించి పెళ్లి చేసాడు కూడ. అయితే భాస్కరాచార్యుని పాండిత్యాన్ని సవాలు చేస్తూ పెళ్లి అయిన మర్నాడే ఆమె విధవరాలయింది. భాస్కరాచార్యునికి తీవ్ర మనస్తాపం కల్గింది.

తన పుత్రికా, తన విద్యాప్రతిభా రెండూ ఓడిపోవడంతో, భాస్కరాచార్యుడు మహానిరాశకు గుఠై, 'అసలు జ్యోతిషశాస్త్రమే ప్రమాణం కా' దనే విధంగా కొత్త పుస్తకాన్ని వ్రాయ సంకల్పించాడు.

ఇంతలో తోటి పండితులంతా వచ్చి 'భాస్కరా! అసలు శాస్త్రమే అబద్ధమై యుంటే శాస్త్రం ప్రకారమే నిర్ణయించిన వైధవ్యం కూడ అసత్యమే కావాల్సి ఉంది. కాని వైధవ్యం వఱకూ సరిగా ఎందుకు జరిగింది? ఈ కారణంగా లీలావతి పెళ్లి, శాస్త్రం ప్రకారం సరైన సమయానికి జరిగి ఉండకపోవచ్చని మాకు అనిపిస్తోంది. అంతేకాదు. పెళ్లికి వాడిన ఇసుక గడియారంలో కూడ ఏదో లోపం ఉండవచ్చేమో'నని ఏకగ్రీవంగా తీర్మానించారు.

సమయం ఇంతయిందని నిర్ణయించేందుకు వీలుగా ఆ రోజుల్లో ఇసుక గడియారాలుంటూండేవి. క్రింద సన్నని రంధ్రం ఉన్న పెద్ద గాజుపాత్రలో జల్లించిన ఇసుకని పోసేవారు. ఆ పాత్రకి క్రిందుగా మరో గాజుపాత్రని ఉంచేవారు. క్రింది పాత్రలోనికి, పైపాత్ర నుండి సన్నగా జారిపడిన ఇసుక ఎత్తుని బట్టి, కాలాన్ని ఘడియ, విఘడియ, లిప్తలనే ఆనాటి తీరు కాలమానంలో గుర్తించేవారు.

కింద ఉన్న ఆ గాజుపాత్ర బయటివైపున ఈ విధంగా కాలాన్ని ఎవ్వరైనాసరే గుర్తించేందుకు వీలుగా కొన్ని ప్రత్యేకమైన అడ్డగీతలుండేవి. ఈ ఇసుక-గడియారం వద్ద తన కూతురి పెళ్లి రోజున సరిగా సమయాన్ని చెప్పవలసిందని గట్టిగా చెప్పి, తన మేనమామనే కూచోబెట్టాడు భాస్కరుడు.

ఇసుకని సరిగా జల్లించని కారణంగా ఒక సందర్భంలో ఒకరేణువు పైపాత్ర రంధ్రానికి అడ్డుపడి ఇసుకని పడకుండా ఆపింది. రెండు మూడు నిమిషాల పిమ్మట ఈ విషయాన్ని గుర్తించిన తన మేనమామ, పైపాత్రని కదిపి సరిచేసాడు. అయితే ఈ సమయానికి ఇంతటి ప్రాధాన్యముందనే విషయాన్ని భాస్కరుడు ఎవరికీ వివరించి చెప్పలేదు. కనీసం ఈ మేనమామకికూడా.

దానిక్కారణం కూతురి వైధవ్యాన్ని గురించి ముందే చెప్తే, ఆమాట ఆనోటా ఆనోటా పాకి అది ఏవిధంగా పరిణమిస్తుందోనని. మేనమామని గుచ్చిగుచ్చి ప్రశ్నించేసరికి నిజాన్ని చెప్పనే చెప్పాడు.

భాస్కరాచార్యునికి ఒక పక్క తన శాస్త్రం నిజమైందేనని పరీక్షలో తేలినందుకు సంతోషమూ, మఱోపక్క తన కూతురి జీవితం బుగ్గిపాలయినందుకు ఆపుకోలేని దు:ఖమూ ఒకేసారి కలిగాయి. ఆ కష్టంలో భాస్కరుడన్న మాట ఒకటే-'కాల స్సర్వేశ్వ రాధీన:'-ఎంతగా ప్రయత్నించినా ఎంత అడ్డుకున్నా పరమేశ్వరుని నిర్ణయానికి మార్పూ మఱో తీర్పూ లేదనీ-కాలం ఆయనకి అనుగుణంగానే పనిచేస్తుందనీను.

**అవశ్యం భావిభావానాం ప్రతీకారో భవే ద్యది।**
**తదా దుఃఖై ర్న సీదేయుః నలరామ యుధిష్ఠిరాః॥**

రాబోయే కష్టాలని తమ మానవ సహజమైన తెలివితేటలతో దాటాలని నలుడూ, రాముడూ, ధర్మరాజూ ... ఇలా ఎవరూ ఏనాడూ ప్రయత్నించి ఉండలేదు. కారణం, విధి ప్రకారం అనుభవించాల్సిన యోగం ఉండగా, మానవ ప్రయత్నం ఎంత చేసినా ప్రయోజనం ఉండనే ఉండబోదని తెలిసి.

ఇలా ఆలోచించి తన దుఃఖాన్ని తీర్చుకొనేందుకూ, తన పుత్రికకి ఊరట కలిగేందుకూ భాస్కరాచార్యుడు తన శాస్త్రపరిజ్ఞానాన్ని తన కూతురు లీలావతికి చెప్తూ ఆమె పేరిటే 'లీలావతీ గణితమ'నే గ్రంథాన్ని వ్రాసి శాశ్వతుడయ్యాడు. కాబట్టి ఈ గ్రంథానికి పేరు పెట్టడం వెనక ఇంతటి బాధామయగాథ ఉందన్నమాట.

చాల శ్లోకాల చివరలో 'ఓ లీలావతీ ఈ లెక్కకి సమాధానమెంతో చెప్పు - లీలావతీ ! నీకు దీని సమాధానం తెలుసా? - ఆలోచించు లీలావతీ ! ' అనే అర్థం వచ్చేలా **'లీలావతి! ప్రోచ్యతామ్! - హే! లీలావతి! జ్ఞాయతే ? ....** ' అంటూ వ్రాసాడు. దీనిక్కారణం అమె బాధని తనదిగా అనుభవిస్తూ, అమెకి ఊరటని కలిగించదలచుకోవడమే.

నేటి కాలపు బీజగణితం, రేఖాగణితం, (జ్యామెట్రీ) ట్రిగనామెట్రీ, మెన్సురేషన్‌లే కాక, ఘాతమూలం (Cube –root) కనుక్కొనే విధానాన్ని మొదటగా చెప్పినవాడు కూడ భాస్కరాచార్యుడే. అయితే నాటి కాలపు లెక్కల ద్వారా లెక్కలు మాత్రమే కాక, సాహిత్యపు మాధుర్యం కూడ విద్యార్థికి తెలుస్తూండేది. ఎంతైనా ఈ శాస్త్రాన్ని వ్రాసింది ఒక మహాకవి కదా !

## 5. ఈ లెక్కద్వారా భారత కథ తెలుస్తోందా ?

భాస్కరాచార్యుని లీలావతీగణితంలోని ఒక లెక్కని మచ్చుకి చూద్దాం - సంస్కృతశ్లోకాల్లో లెక్కలుంటాయా ? అని కొట్టిపారేయకుండా.

**పార్థః కర్ణవధాయ త చ్ఛరగణం క్రుద్ధో రణే సందధౌ**
**త స్యార్ధేన నివార్య త చ్ఛరగణం మూలై శ్చతుర్భి ర్హయాన్ ।**
**శల్యం షడ్భి ర థేషుభి స్త్రిభి రపి చ్ఛత్రం ధ్వజం కార్ముకం**
**చిచ్ఛే దాస్య శిర శ్శరేణ కతి తే యా నర్జున స్సందధౌ?**

'కురుక్షేత్ర యుద్ధరంగంలో అర్జునుడూ కర్ణుడూ యుద్ధం సాగిస్తున్నారుట. కర్ణుణ్ణి చంపడానికి అర్జునుడు వేసిన మొత్తం బాణాల్లో సగం (మొత్తం బాణాలని x అనుకుంటే $\left(\frac{x}{2}\right)$ అన్నమాట.) కర్ణుడు వేసే బాణాలని ఎదుర్కోవడానికి పట్టాయిుట.

మొత్తం వేసిన బాణాల వర్గమూలానికి నాల్గురెట్ల బాణాలు $\left(\sqrt{x} \times 4 = 4\sqrt{x}\right)$ కర్ణుని గుఱ్ఱాలని కొట్టడానికి పట్టాయిుట.

కర్ణుని రథసారథి అయిన శల్యుణ్ణి కొట్టడానికి 6 బాణాలూ, కర్ణుని గొడుగునీ + రథం మీద జెండానీ + విల్లునీ కొట్టడానికి ఒక్కొక్కదానికీ ఒక్కొక్కబాణం చొప్పున మొత్తం 3 బాణాలు పట్టాయిుట.

చిట్ట చివరగా కర్ణుని తల నఱకడానికి ఒకే ఒక్కబాణం పడితే మొత్తం అర్జునుడు వేసిన బాణాలెన్ని?' అని లెక్క.

సమాధానం 100 అవుతుంది.

కర్ణుణ్ణి ఎదుర్కొన్నవి $\frac{100}{2} = 50$ బాణాలు.

100 కి వర్గమూలం 10 కాగా, నాల్గురెట్ల బాణాలు (4 × 10) అంటే 40 టితో గుఱ్ఱాలని కొట్టాడన్నమాట.

శల్యుణ్ణి 6టితో, ఛత్ర-ధ్వజ-కార్ముకాలని మూటితో కొట్టగా (50 + 40 + 6 + 1 + 1 + 1) 99 బాణాలయ్యాయి.

మిగిలిన బాణంతో కర్ణుని తలని కొట్టాడన్నమాట. అక్కడికి 100 బాణాలూ పూర్తయ్యాయి గదా !.

'సమాధానం వంద అనుకొనుము' - అని ప్రారంభించి లెక్కని చేసే విధానాన్ని మొట్టమొదటగా ప్రారంభించినవాడూ, మనకి నేర్పినవాడూ భాస్కరుడే నన్నమాట. అలాగే ఈ లెక్కని బీజగణితం ద్వారా చేయవచ్చునని తెల్పినవాడు కూడా భాస్కరుడే. బీజగణితం ప్రకారం చూస్తే

$$x = \frac{x}{2} + 4\sqrt{x} + 10$$

$$\frac{x}{2} = 4\sqrt{x} + 10$$

$$\sqrt{x} = \frac{8 + \sqrt{64 + 4 + 20}}{2}$$

$$\sqrt{x} = \frac{8 + 12}{2}$$

$$\sqrt{x} = 10$$

$\therefore x = 10 \times 10 = 100$ అవుతుంది. నేటి 'x' నే నాడు 'క' అని అంటూండే వారు.

నేటి లెక్కల ప్రకారం 'లెక్కలు మాత్రమే' వస్తూంటే, నాటి లెక్కల ప్రకారం ఎన్నో విషయాలు తెలిసేవి. ఎలా తెలిసేవో ఈ శ్లోకంద్వారానే చూద్దాం.

**ముందుగా రాజనీతి తెలుస్తుంది.** ముందుగా అవతలి యోధుడు వేసే బాణాలని ఎదుర్కోవాలనీ, మీదట అతని గుర్రాలని కొట్టాలనీ, దాంతో అతను యుద్ధరంగంలో ఎటూ పోలేకపోతాడు కాబట్టి వేరే రథం ఎక్కే వీలు లేకండా సారథిని కొట్టాలనీ, 'ఈ రాజు పనైపోయిం'దని అందఱూ అనుకొనేందుకై జెండానీ, గొడుగునీ, విల్లునీ కొట్టాలనీ ఆ మీదట శాశ్వతంగా ఎదుటి వ్యక్తి కనుమూసేలా కంఠాన్ని ఉత్తరించాలనీ... ఇక్కడి శ్లోకం ద్వారా తెలిసిన రాజనీతి రహస్యం.

**తర్వాత భారత కథ తెలుస్తుంది.** అర్జునుడంతటి యోధుడు కర్ణుణ్ణి 50 బాణాలతో అడ్డగించవలసి వచ్చిందంటే కర్ణుడెంత విలుకాడో అర్థమౌతుంది.

అలాగే గుర్రాలకి 40 బాణాలు వాడాల్సి వచ్చిందంటే ఆ గుర్రాల పరిగెత్తి పారిపోయేశక్తీ, బాణాలకి తప్పించుకోగల నేర్పరితనమూ తెలుస్తుంది.

శల్యుడు 6 బాణాలకే లొంగిపోవడాన్ని బట్టి అతని పాండవ పక్షపాత ధోరణి విదితమౌతుంది.

మూడు బాణాల్లోనే ఛత్రధ్వజకార్ముకాలు పడిపోయాయంటే, కర్ణుని నిస్సహాయత తెలుస్తుంది.

భారత కథ ప్రకారం కర్ణుడు తల తెగి పడ్డవాడే. ఈ శ్లోకం ద్వారా సంస్కృత భారతంలోని ఈ యథార్థం మఱో మాఱు స్పష్ట మౌతుంది.

ఇక భాషా విశేషాలకి వస్తే ఎన్నెన్నో సంధులూ సమాసాలూ తెలుస్తాయి.

ఏవో 'లెక్కలంటే ఎక్కడో ఉండే' వనే అభిప్రాయం కాక లెక్కలు ప్రతి సందర్భంలోనూ ప్రతి సంఘటనలోనూ కన్పిస్తూనే ఉంటాయనే విషయాన్ని ఈ శ్లోకం మఱింత తెలియజేస్తుంది.

ఇలాటి గణితం ద్వారా లీలావతీ-భాస్కరాచార్యుడూ శాశ్వతంగా నిలిచిపోయారు.

## 6. ఆ శ్లోకాలే నన్ను దొంగని చేసాయి.

పండితులకి ప్రసిద్ధి కాశ్మీర దేశం. ఆ దేశంలో కల్హారుడనే సంస్కృత పండితుడు 'కాంతాకల్యాణ కాంత ప్రహసనమ్' అనే పేరిట ఎంతో నవ్వు పుట్టించే ఒక గాథ (ప్రహసనం) వ్రాసాడు. దురదృష్టవశాత్తూ ఈ ప్రహసనమూ ఈ కవీ కూడా తెర మరుగైపోయారు గాని, ఈయనని గూర్చి ఎవరో కవి చెప్పినమాట ద్వారా 'నేనూ ఉన్నా' నంటూ జీవిస్తూనే ఉన్నాడు కల్హారుడు.

కాళిదాసూ మొదలైన మహాకవులకి ఎంతెంతో ధనాన్ని భోజమహారాజు ఇస్తున్నాడని విని, పుట్టుకతో నిరుపేద అయిన కల్హారుడు భోజుడుండే ధారానగరానికి వచ్చాడు. తనకంటె ముందుగా వచ్చిన మహాకవులు భోజుని ఆస్థానానికి వెడుతూండడమూ, విశేష సంమానాలతో తిరిగి వస్తూండడమూ అతనికి కన్పించింది. తన పేరూ నమోదయింది కాని తనవంతు వచ్చేసరికి మఱో వారంరోజులు పట్టవచ్చనిపించింది కల్హారునికి.

అయితే రాజాస్థానంలో సభ ఎలా జరిగేదీ, సంమానాలు ఎలా జరుగుతున్నదీ చూడాలనే ఉత్సుకతతో ఆయన ప్రతిదినమూ ప్రేక్షకుల వరసలో కూర్చొని వస్తూనే ఉన్నాడు. రెండు రోజులయిందో లేదో, ఆ కల్హారుడిలో ఓ దురాలోచన మెదిలింది. విద్వాంసుడై యుండి కూడా రాజాశ్రయానికి నోచుకోక కటిక పేద తనంతో ఈడ్చుకొస్తున్న తన జీవితానికి ప్రతిబింబం ఆ ఆలోచన.

రాజాస్థానంలో అంతా బంగారమే. పన్నీరు బుడ్డి మొదలుకొని పట్టపేనుగు ముఖం జాలరీలవఱకూ అంతా బంగారం -బంగారం- బంగారమే కావడంతో 'కనీసం ఒక్క చెంబునైనా దొంగిలిస్తే ఈ జీవితానికి సరిపోతుందిగదా !' అనిపించింది కవికి.

కాస్త పొద్దుపోయాక ఎలాగో దొడ్డివైపున ఉన్న ఉద్యానవనం గుండా సైనికుల కనుగప్పి మెల్లగా అంచెలంచెలుగా భోజుని శయనమందిరానికే చేరాడు రాత్రి వేళకి. కవికి కన్ను చెదిరిపోయింది ఆ బంగారాన్ని చూసేసరికి.

రాజమందిరం వెలుపలయితే కాపలా ఉంటుంది గాని లోపల అలాటి గట్టి కాపలా ఉండని కారణంగానూ, రాజు లోనికి రాబోతూన్న వేళ అందరికీ విన్పించేలా గంటల మోత ఉంటుంది కాబట్టీ, కవి, ఆ భోజరాజు వచ్చేలోగా పని పూర్తి చేయదలచి తనతో తెచ్చిన సంచి తెరిచిపట్టి ఒక బీరువాని తెరిచాడు.

కళ్లు చెదరిపోజేస్తూ చక్కని వజ్రాల గొలుసు కన్పడింది. దాన్ని సంచిలో వేయబోతూండగా 'బంగారు కంఠహారాన్ని దొంగిలిస్తే పది జన్మల పాటు మూగవాడై పుడతాడు' అనే అర్థమున్న శ్లోకం గుర్తొచ్చింది పండితునికి. 'నోరుంటే గదా నాలుగురాళ్లు సంపాదించుకోగలం!' అనుకుని, ఆ హారం ఆలోచన మానుకుని బీరువా పైఅరలో చేయి పెట్టాడు.

ఎన్నెన్నో చెక్కడాలతో రత్నాల వడ్డాణాలు వివిధ రీతుల్లో కన్పించాయి. కంటికి బాగా నచ్చిన వడ్డాణాన్ని సంచిలో వేయబోతూండగా 'బంగారు వడ్డాణాన్ని దొంగిలిస్తే ఎనిమిది జన్మలపాటు అవిటివాడై జీవిస్తాడు' అనే అర్థమున్న శ్లోకం గుర్తొచ్చింది పండితునికి.

'కాలూ చేయీ లేకపోతే కైలాసం కూడా నరకమే కదా !' అనుకుని, ఆ వడ్డాణం ఆలోచన మానుకుని మరో అరలో చేయి పెట్టాడు.

చెప్పలేనన్ని మేలి ముత్యాల దండలు గట్టి బంగారు తీగెతో చుట్టబడి కన్పించాయి. మంచి ఖరీదైన వనుకున్న కొన్ని దండలని సంచిలో వేయబోతూంటే 'రాజుగారి ముత్యాలహారాన్ని దొంగిలిస్తే ఆరు జన్మల పాటు కళ్లు లేనివాడుగా పుడతాడు' అనే అర్థమున్న శ్లోకం గుర్తొచ్చింది పండితునికి.

'నేత్రం లేనిదే జీవయాత్రే లేదుకదా !' అనుకుని, ఆ ముత్యాల హారపు ఆలోచన మానుకుని మరో అరలో చేయి పెట్టబోయాడు. ఇలా శ్లోకాలు గుర్తురావడమూ, తాను దొంగతనం చేయలేకపోవడమూ జరుగుతూ కాలయాపన జరుగుతూ పోతే 'రాజుగారు మందిరంలోనికి రానే వస్తా'రనుకుని కళ్లు మూసుకుని ఏదో గుర్తుకి రాబోతూన్నా ధైర్యం తెచ్చుకుని ఎంతో ఇష్టంతో 'తాను ఎప్పటినుండో లేదని బాధపడుతున్న బంగారపు చెంబు'ని కాస్తా సంచిలో పడవేసుకుని బయలుదేరబోయాడు.

దివాణంలో గంటలు మోగసాగాయి. అంటే రాజుగారు మందిరానికొస్తున్నారన్నమాట. ఈ శ్లోకాల కారణంగా ఎంత సమయం వ్యర్థమయింది ! ఇప్పుడు తాను పట్టుబడడం ఖాయమనుకుంటూ భయంభయంతో దిక్కుతోచక రాజుగారి బంగారు మంచంకిందే నక్కి కూచున్నాడు పండితుడు.

తన పక్కన ఒక సంచి. అందులో ఒక బంగారు చెంబు. ఆమంచం మీది దుప్పటీని, నాలుగువైపులకీ నేలకి ఆనేలా వేసిన కారణంగా పండితుడికి 'తను ఏదో గదిలో ఉన్నట్లే' ఉంది. లోపల భయంగా ఉన్నా ఎప్పుడో నిద్ర పట్టనే పట్టింది.

తెలవారింది. అకస్మాత్తుగా దివాణంలోని గంటలమోతకి పండితునికి మెళుకువొచ్చింది. ఆ మందిరానికున్న తలుపులూ కిటికీలూ అన్నింటినీ తెరిచారు.

ఎందరో అందగత్తెలు రాజుగారికి కర్పూరహారతులనిస్తున్నారు.

రాజుగారి బాల్యమిత్రులు విలువైన వస్త్రాలలో వచ్చి 'రాత్రి సుఖంగా నిద్రపట్టిందా?' అని అడుగుతున్నారు. వందిమాగధులు రాజుగారి గొప్పదనాన్ని పొగడసాగారు.

ఇటువైపు కిటికీ లోంచి ఏనుగుల ఘీంకారాలూ, అటువైపు కిటికీలనుండి గుఱ్ఱాల సకిలింపులూ విన్పిస్తున్నాయి.

ఈ రమణీయసందర్భం చూడగానే కవితా ప్రియుడైన భోజునికి ఆనందంతో కవిత్వం రానే వచ్చింది.

**చేతోహరా యువతయ స్సుహృదోఽనుకూలాః**

**స ద్బాంధవాః ప్రణయగర్భగిర శ్చ భృత్యాః।**

**గర్జంతి దంతినివహా స్తరలా స్తురంగాః** .... అంటూ,అప్పుడున్న ఆ పరిస్థితినీ ఆ కోలాహలాన్నీ కళ్లకు కట్టినట్లు వర్ణించి, నాల్గవ పాదం ఎలా చెప్పి శ్లోకాన్ని ముగించాలా ? అనే ఆలోచనలో పడిపోయాడు భోజుడు. ఎంత ఆలోచించినా ముగింపు కుదరడం లేదు భోజునికి.

'ఏదో కవులకవిత్వాన్ని విని తోచిన బహుమతులని భోజుడు ఇస్తూంటా'డని భావించిన పండితునికి, భోజుడు ఆశువుగా చెప్పిన ఈ శ్లోకం మూడుపాదాలూ వినగానే చెప్పలేని ఆనందం ఉత్సాహం కలిగాయి. లోపలనుండి తన్నుకొస్తూన్న

కవిత్వాన్ని ఆపుకోవాలనే ధ్యాస కూడా లేకుండా '**సంమీలనే నయనయో ర్న హి కించి దస్తి** (ఇంతటి సంపదలూ భోగాలూ అన్నీ కూడా కన్నుమూస్తే (నిద్రిస్తే లేదా మరణిస్తే) ఏ మాత్రమూ లేనే లేవు) అని పూర్తి చేసేసాడు.

ఈ వేదాంతంతో కూడిన చక్కని కవిత్వం, అందునా తాను ఏ తీరుగా శ్లోకాన్ని ముగించాలా ? అని ఆలోచిస్తూన్న వేళ తనకి నచ్చేలా చేసిన ముగింపూ బాగా నచ్చిన భోజుడు 'కవిత్వం చెప్పిన పండితుడెక్కడ?' అన్నాడు.

అంతే! మంచం కింద ఉన్న పండితునికి ప్రాణాలు పైనే పోయాయి. శ్లోకాలు వచ్చిన కారణంగా దొంగతనం చేయలేక పోయాను సరిగదా! కవిత్వం వచ్చిన కారణంగా దొరికిపోయాను కూడా!! అని బాధపడుతూ మంచం కిందినుండి బయటికి వచ్చి మౌనంగా నమస్కరించి తల వంచి నిలబడ్డాడు భోజుని ముందు. అతని చేతిలో ఒక సంచీ, సంచీలో రాజుగారి బంగారపు చెంబూతో వణికిపోతున్నాడు ఏం జరుగబోతోందో అని.

భోజుడు మంచం దిగి పండితుణ్ణి కౌగిలించుకుని తాను చెప్పిన పాదాలతో పాటు మొత్తం శ్లోకంలోని ప్రతిఅక్షరానికీ లక్ష చొప్పున బహుమతినీయాల్సిందని మంత్రిని ఆదేశించాడు. పండితుడు తన పేదతనం కారణంగానే ఈ పనిని చేయబోయాడని గమనించి ఆ బంగారపు చెంబుని కూడ బహుమానంగా ఇచ్చివేసాడు భోజుడు.

గమనించి చూడండి. ఆనాటివారి ఔదార్యం నేటివారికి కనీసం మాటలలోనైనా వస్తుందా ? అందుకే నాటి వారంతా కీర్తిశరీరాలతో జీవించే ఉన్నా(ంటా)రు.

## 7. నా చెంబు పోయిన విధం బెట్టి దనిన ....

భోజుడు పండితుణ్ణి సంమానించాక 'కవీశ్వరా ! నా మందిరంలో ఇన్ని బంగారుపళ్లాలు కన్పిస్తూంటే-ఇంకా విలువైనవి ఎన్నెన్నో కన్పిస్తూంటే-నీ దృష్టి ఈ చెంబు మీదే ఎందుకు పడింది?' అని నవ్వుతూ అడిగాడు. పండితుడు భయాన్ని విడిచి శ్లోకాన్ని ఇలా చెప్పి వివరించాడు.

**గ తానుగతికో లోకః న లోకః పారమార్థికః।**
**గుప్త సైకతలింగేన నష్ట మ్మే తామ్రభాజనమ్ ॥**

భోజరాజా ! ఒకసారి మంచిపర్వదినం వచ్చింది. అందఱూ నదిలో స్నానం చేస్తూంటే నేనూ స్నానానికి వెళ్లాను. నా రాగిచెంబు నాకున్న ఆస్తిపాస్తుల్లో పెద్ద ఆస్తి వంటిది. అంతమందిలో ఆ హడావుడిలో నా ఈ చెంబు కాస్తా పోతుందేమో ! అనే భయం కల్గింది. నీళ్లలోకి దిగి స్నానం చేసేటప్పుడు చెంబు అవసరం నాకున్నా, నీళ్లలోనే నిలబడి జపం చేసుకునేప్పుడు ఈ చెంబు అడ్డమౌతుంది నా జపానికి. అప్పుడైనా దాన్ని ఒడ్డున పెట్టక తప్పదు. 'తీరా పోతేనో?' అనుకుంటూండగా చటుక్కున ఓ ఆలోచన తట్టింది.

అంతే! ఏవో మంత్రాలు చదువుతూ ఆ రాగిచెంబుని ఒడ్డున బోర్లించి దానిమీద ఇసుకతో ఒక శివలింగాకారాన్ని చేసాను. దానిమొదట్లో రెండు పువ్వులు కూడ వేసాను. ఇక నా చెంబుకి దిగులు లేదని నదిలో దిగి స్నానం చేసి సంధ్యవార్చి జపం ముగించి ఒడ్డువైపు చూడగానే గుండె గుభేలుమంది.

ఒడ్డున ఎక్కడ చూస్తే అక్కడ వరసలలో ఇసుక శివలింగాలే దర్శనమిచ్చాయి. అంతేకాదు. మంచి పండితుడూ, కవీశ్వరుడూ మంత్రాలు వచ్చినవాడూ అయిన బ్రాహ్మణుడు, చెంబుని ఇలా ఇసుకలో శివలింగంలో దాచాడంటే, అది ఏ వేదంలోనో శాస్త్రంలోనో చెప్పబడి ఉంటుందనీ, దానివల్ల ఎంతో కొంత పుణ్యం వస్తుందనీ, 'నదిలో స్నానం చేయబోయే ప్రతివ్యక్తీ ఆచరించవలసిన సంప్రదాయపద్ధతి అది అయ్యుంటుందనీ అంతా భావించి అలా చేసా'రని అర్థమైంది.

ఇక నేనేది చేస్తే దాన్ని మఱుక్షణంలో చేయబోతున్నారని కూడా వాళ్ల చూపులని బట్టి అర్థమై అన్ని శివలింగాల్లో నా చెంబున్న శివలింగమేదో తెలియక మనసులో ఎంతో మథనపడ్డాను. అయినా తప్పదుగదా ! ఏవో మంత్రాలని చదువుతూ (వాటికీ చెంబుకీ సంబంధం లేనే లేదు గదా!) మెల్లగా ఒక శివలింగాన్ని చేతితో చితిపాను. నా ఉద్దేశ్యంలో ఆ శివలింగంలో నా చెంబు ఉండచ్చని అనిపించి అలా చేసాను. కాని ఆ శివలింగం నా చెంబులింగం (చెంబుదాచిన లింగం) కాదు. (చెంబులింగమనే వాడుక ఈయన ద్వారానే లోకానికి వచ్చింది.)

నేను శివలింగాన్ని చితపడాన్ని చూస్తూనే భక్తులంతా మిగిలిన లింగాల్ని చితిపేసారు. ఆ హడావుడిలో ఆభక్తుల కోలాహలంలో ఎవరెవరికి ఎవరెవరి చెంబులుదొరికాయో నాకు తెలియదు గాని, నా బంగారంలాటి రాగి చెంబు మాత్రం పోనే పోయింది.

రాజా! ఎవరేది చెప్తే దాన్ని చేద్దామని లోకం భావిస్తూ ఉంటుందే తప్ప, దానిలో విశేషమేమిటని గాని, నిజంగా ఆ ఆచారంలోని అంతరార్థమేమిటని గాని, దానిలో పరమార్థం ఏదైనా ఉందా? అనిగాని ఎవ్వరూ ఆలోచించనే ఆలోచించరు. ఇలా నాచెంబు కాస్తా గంగపాలైంది (గంగ ఒడ్డున దొంగలపాలైంది) అని కథ ముగించాడు కల్హారుడు.

ఈ కథ విని భోజుడు మరింత ఆనంద పడి, మరో బంగారు చెంబుతో సహా పండితుని పోయిన రాగిచెంబుకంటె పెద్ద చెంబులని రెంటినిచ్చి పంపాడు కవిని. కొన్ని కొన్ని సంఘటనలు శాశ్వతత్వానికి నోచుకుంటాయంటే ఇదిగో ఇదే ఉదాహరణ. ఈ కథ ఇప్పటికే కాదు ఎప్పటికీ సజీవంగానే ఉంటుంది. కారణం ఆ శ్లోకాన్ని వ్రాసిన పండితుని పూజాఫలం - దాన్ని విని ఆనందించిన భోజుని తపఃఫలమూను.

## 8. పుత్రుని ఋణం తీరితే ఏమౌతుంది ?

భోజుని ధారానగరంలో 'దాసు' అనే చెప్పులు కుట్టే వ్యక్తి ఒకడుండేవాడు.ఎంత కాలానికీ అతనికి సంతానం కలగలేదు. ఎన్నెన్నో పూజలూ పురస్కారాలూ దేవుళ్లకి ప్రదక్షిణాలూ చేసాడు. అతడూ అతడి భార్యా ఈ విషయమై ఎంతో దుఃఖపడుతూండే వారు కూడ.

ఒకసారి ఒక దేవాలయంలో ఒక మహాపండితుడు దేవుణ్ణి గూర్చి ఉపన్యసిస్తూంటే అంతా అయ్యాక ఆయనకి తనగోడుని విన్పించుకుని 'తానెలా తండ్రిని కాగలనో' చెప్పవలసిందని ప్రాధేయపడ్డాడు దాసు. ఆయన బాగా ఆలోచించి, సరిగా అదే సమయానికి దైవదర్శనానికి వస్తూన్న ఒక యోగిని చూపించి "ఈయన - 'న ప్రతిగ్రహీత' - అంటే ఎవరిదగ్గరా ఏమీ తీసుకోనివాడు. ఈయనని నీకు బాకీ పడేలా చేసుకోగల్గితే నీకు పుత్రుడు తప్పక పుడతాడు. ఇంతకు మించి నేను చెప్పగలిగింది లేదు" అంటూ వెళ్లిపోయాడు పండితుడు.

దాసు ఆలోచనలో పడ్డాడు. 'ఎవరినుండీ దేన్నీ ఎప్పుడూ తీసుకోకుండా బ్రతికే ఈయనకి నేనేమి ఈయగలను? ఒకవేళ ఆయన ఫలానిది తెమ్మని అడిగితే తేగలిగిన ఆర్థిక స్థితి నాకేముంది గనుక ?' అనుకుంటూ దివ్యతేజస్సు వెలుగుతూన్న ఆ యోగికి నమస్కరించాడు. ఆయన ఒక క్షణం అలా తలెత్తి చిరునవ్వు నవ్వి, చేయెత్తి ఆశీర్వదించినట్లుగా చూసి వెళ్లిపోయాడు.

ఆ యోగి ఉండే ఆశ్రమం, ఆయన స్నానం చేసే సమయం, స్నానాల రేవూ, ఆయన భోజన సమయం, తినే పండ్లుండే వనం ...... ఇలా ఇన్నింటినీ కొన్నాళ్లు పరిశీలించి 'తనకి ఆయన ఎలా ఋణగ్రస్తుడౌతాడా ?' అని ఆలోచిస్తూంటే చెప్పలేని మంచి ఉపాయం తట్టింది దాసుకి.

అంతే ! తనకి బాగా నైపుణ్యమున్న తన వృత్తితో, చక్కని నాలుగు చెప్పుల జతలని కుట్టి, యోగి తన ఆశ్రమం నుండి స్నానానికి వెళ్లే త్రోవలో అక్కడక్కడ చొప్పున నాల్గుచోట్ల ఉంచాడు.

అది మంచి ఎండలకాలం. మధ్యాహ్నం వేళ చండ్రనిప్పులని కురిపిస్తూ సూర్యుడున్నవేళ, యోగి తన మధ్యాహ్న స్నానానికని బయలు దేరాడు. తలపై గొడుగూ కాలికి చెప్పులూ ధరించే అలవాటే ఆయనకి లేదు. వెళ్లేప్పుడూ వచ్చేప్పుడూ కూడ ఆ చెప్పుల జతల వైపు చూపుని కూడ ప్రసరింప జేయలేదు యోగి. ఆయన కంటపడకుండా పొదలవెనుక దాగిన దాసు నిరాశపడ్డాడు.

అయినా, పట్టుదల వీడని దాసు రెండో రోజున కూడ అలాగే ఉంచాడు చెప్పులని. యోగి స్నానానికి వెడుతూన్న వేళలో చెప్పుల వంక చూడలేదు గాని, వచ్చే సమయంలో మాత్రం కాళ్లు మాడిపోతుంటే చెప్పుల వంక చూసుకుంటూ ఆశ్రమానికి వచ్చాడు. ఇంతమాత్రం మార్పుందికదా! అని దాసు ఆనందపడ్డాడు.

మూడో రోజున వెళ్లేప్పుడు కూడ చెప్పులని పరీక్షిస్తూ వెళ్లాడు యోగి. వచ్చేప్పుడు మూడు చెప్పుల జతలని దాటి, ఇక ఎండ ధాటికి ఆగలేకా-కాళ్లుమాడుతూంటే తట్టుకోలేకా-నాల్గవ చెప్పుల జతలో కాళ్లుపెట్టి క్షణం నిలబడి, ఎండకి కాళ్లు మాడడాన్ని కొంత తగ్గించుకుని మళ్లీ వట్టి కాళ్లతోనే వెళ్లి పోయాడు.

నాల్గవ రోజున ఎండ మఱింత కావడంతో యోగి వెళ్లేప్పుడు ఎలాగో వెళ్లినా వచ్చేప్పుడు వట్టి కాళ్లతో రాలేక చెప్పులజతని ధరించి ఆశ్రమానికి రానే వచ్చాడు. ఆ చెప్పులెవరివో తనకు తెలియదు. ఎవరు వాటిని పెట్టారో అంతకన్నా తెలియ (లే)దు యోగికి. దేన్నీ పుచ్చుకోని తాను 'ఈ విధంగా ఋణగ్రస్తుడు కావాల్సి వచ్చిందే!' అని ఎంతో బాధపడ్డాడు.

అయినా విధిలేక రోజూ ఆ చెప్పులని వాడడం ప్రారంభించాడు యోగి. చెప్పులే లేని కాలంలో ఇంతకుమించిన ఎండని కూడ లెక్కచేయకుండా తానెలా వెళ్లగలుగుతూండేవాడో తనకే బోధపడలేదు. 'అవకాశం ఉంటే కావాలనుకున్న

వస్తువు మీదికి ఆలోచన పోతుం'దనే కొత్త విషయాన్ని తెలుసుకున్నా, ఈ చెప్పుల కారణంగా తాను బాకీ పడ్డానని ఎంతో బాధపడసాగాడు యోగి.

ఇది జరిగిన కొన్నాళ్లకే, 'తాను నెలతప్పా'నని దాసుకి తన భార్య చెప్పింది. మహాపండితుడూ వేదాంతీ తమకి పుత్రునిగా పుట్టబోతున్నాడని భార్యకి చెప్పి జరిగిన కథని వివరించాడు దాసు. అప్పటినుండీ ఆమె మఱింత శ్రద్ధగా గర్భాన్ని రక్షించుకోసాగింది.

దాసు మాత్రం భార్యకి ఒకటికి రెండు మార్లు చెప్పింది ఒకటేమాట. 'ఏ డూ పిల్లవాని నుండి ధనాన్ని తీసుకోకు. మనకి ఋణపడ్డ ఆ యోగి, మనకి పుత్రుడుగా పు బోతున్నాడు. ఆ పిల్లవాని నుండి సొమ్ముని తిరిగి ఏ ఆదమఱపునైనా తీసుకున్నట్లైతే ఆ ఋణం తీరిపోయి, మనకి పెద్ద ప్రమాదం జరుగవచ్చు' అని.

ఇటు యోగి, తానెవరికి పుట్టవలసి వస్తుందోనని బాధపడుతూంటే, అటు దాసు దంపతులు పుత్రుడు పుట్టబోతున్నాడని సంతోషపడసాగారు. తొమ్మిదినెలలు నిండగానే ఇటు యోగి మరణించడం, అటు ఆ దాసుకి పుత్రుడు పుట్టడం ఒకేసారి జరిగాయి.

భోజుని ఆస్థానపు ప్రధానద్వారం వద్ద కావలా ఉద్యోగిగా ఉండే దాసు, లేకలేక కలిగిన తన పుత్రుణ్ణి ఎప్పుడూ విడిచి ఉండేవాడు కాదు. తనతోనే తీసుకుపోతూండేవాడు. భోజాస్థానంలో అటూ ఇటూ తిరుగుతూండే కవులూ వారి కవిత్వాలూ కారణంగానూ-పూర్వసంస్కారఫలితంగానూ-పిల్లవానికి అయిదవ ఏటనే సంస్కృత కవిత్వం రానే వచ్చింది.

నగరంలోని ప్రధానమైన కూడలిలో ఉన్న పెద్ద గంటని తాడుతో లాగి 'నగరంలో దొంగలు పడవచ్చు. జాగ్రత్తగా ఉండండి' అని రాత్రిపూట ప్రతిజాములోనూ హెచ్చరికని చేసే ఉద్యోగం దాసుభార్యది. మూడుగంటల కాలాన్ని జాముగా వ్యవహరించేవారు కాబట్టి, ప్రతిరాత్రీ ఆమె నాలుగు మార్లు ఈ హెచ్చరికని చాటింపుగా చెప్తూ ఉండేది. పిల్లవాడు రాత్రిపూట ఆమెవద్దే ఉంటూండేవాడు.

ఒకనాటి రాత్రి మొదటిజాములో ఆమె హెచ్చరికని చేసి నిద్రమత్తు కారణంగా బాగా నిద్రపోయింది. బాలుడు లేచాడు. రెండవ జాము సమయం అయినా కూడా ఆమె హెచ్చరికని చేయలేదని గమనించాడు. తాడు లాగి గంటని కొట్టాడు. అయినా ఆమె పగలంతా బాగా అలసి ఉన్న కారణంగా నిద్ర లేవలేదు. వెంటనే ఇలా హెచ్చరిక చేసాడు బిగ్గఱగా.

**'మాతా నా స్తి పితా నా స్తి నా స్తి బంధు స హోదరా :**
**అర్థం నా స్తి గృహం నా స్తి తస్మా జ్జాగ్రత ! జాగ్రత!'**

'ఓ! ప్రజలారా ! ఈమె నా తల్లీ, ఇతడు నాతండ్రీ, వీళ్లు నా బంధువులూ, వీళ్లు నా సోదరులూ అని అనుకోవడమంతా ఒక కల్ల. ప్రతిజన్మలోనూ ఒక్కొక్కరుగా మారుతూ ఉంటారు వీళ్లు. ఈ ఇల్లు నాదీ, ఈ ధనం నాదీ అనుకోవడమూ వట్టి భ్రమే. నీకుముందు 'ఈ ధనం ఈ యిల్లూ నావే' అని మఱొకడనుకున్నాడు. నీ తర్వాత మఱొకడు అలా అనుకోవడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇలా ఈ వేదాంతాన్ని తెలుసుకుని జాగ్రత పడాలి గాని నగరంలోని దొంగలొక దొంగలా ? శరీరంలో ఉండే 'మమ' కారం (అంతా నాదే) అనే దొంగకి భయపడాలి సుమా !' అనే అర్థమున్న పై శ్లోకాన్ని చాటాడు పిల్లవాడు.

చక్కని కంఠంతో అర్థవంతంగా రాగయుక్తంగా పల్కిన ఆ శ్లోకం భోజుని చెవిని పడింది. భటుల్ని పంపి ఆ శ్లోకాన్ని చదివినవాడెవరో గుర్తించవలసిందని చెప్పాడు. మూడవ జాముకోసం ఎదురుచూచాడు.

మళ్లీ గంట విన్పించి మీదట శ్లోకం ఇలా విన్పించింది.

**'ఆశయా బధ్యతే లోకః కర్మణా బహు చింతయా।**
**ఆయుఃక్షీణం న జానాతి తస్మా జ్జాగ్రత ! జాగ్రత!! ॥'**

'ఓ! ప్రజలారా ! ఏవో కోరికలూ - దానితో అవి తీరలేదనే చింతలూ ... అనే వీటితో ఏదో ఒక దుఃఖంతోనే ప్రతివ్యక్తీ జీవయాత్రని సాగిస్తున్నాడు. ఆ 'కోరికే'-ఈ దుఃఖానికి కారణమనీ, కోరికని తగ్గించుకోవాలనీ ఎవరూ అనుకోవడం లేదు. పైగా ఆ కోరికని నెరవేర్చుకోవడానికి చేసే ప్రయత్నంలో ఆయుష్యం క్షీణిస్తోందని భావించడమూ లేదు. రోజు గడిస్తే రోజు అయిపోవడం లేదు గాని వ్యక్తి ఆయుష్షు తరిగి పోతోందనే ఈ సత్యాన్ని తెలుసుకోవడం కోసం జాగ్రతగా (మెలకువ) ఉండాలిగాని నగరంలో దొంగలని గూర్చికాదుసుమా !' అనే అర్థమున్న శ్లోకాన్ని చాటాడు బాలుడు.

ఆ రాత్రి తెలవారుతూన్న నాల్గవ జాముని ఎదురుచూస్తూ భోజుడు, ఆ పిల్లవానికీయవలసిన బంగారు నాణాలని కూడ తెప్పించి సిద్ధంగా ఉంచాడు. కొంత కొంతసేపటికి గంట విన్పించి ఆ మీదట ఇలా శ్లోకం విన్పించింది.

**కామః క్రోధ శ్చ లో భా ద్యాః దేహే తిష్ఠంతి తస్కరాః।**
**జ్ఞానర త్నాపహారాయ తస్మా జ్జాగ్రత జాగ్రత॥**

'ఓ! ప్రజలారా! కామ - క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్యాలనే దొంగలు శరీరంలోనే ఉన్నారు. వీళ్లు ప్రతి వ్యక్తికీ ఉండే జ్ఞానమనే రత్నాన్ని దొంగతనం చేయాలని పొంచి ఉంటారు. ఆ శరీరంలోని దొంగల విషయంలో జాగ్రత కావాలి గాని ఇళ్లలో వస్తువుల విషయంలో కానే కాదు సుమా !' అనే అర్థమున్న శ్లోకాన్ని బాలుడు చాటగానే తల్లికి మెలకువ వచ్చి భయపడి పోయింది-'రాత్రి రాత్రంతా చాటింపు వేయలేదు గదా!'- అని. అంతలో రాజభటులు వచ్చి 'ఆమెనీ పిల్లవాణ్ణీ రాజుగారు రమ్మంటున్నా'రని చెప్పారు.

భోజుణ్ణి చూస్తూనే ఆ తల్లి 'తప్పయింది మహారాజా ! మన్నించు' అంటూ సాష్టాంగ పడింది. ఆమెని పైకి లెమ్మని చేతితో సూచిస్తూ ' నీపుత్రుడు పండితుడయ్యే సూచనలు బాగా కన్పిస్తున్నాయి. ఇప్పటివఱకూవిన్న అతని కవిత్వానికి మా ఆశీస్సులని అందిస్తున్నాం' అంటూఆ బంగారునాణాలున్న పళ్లాన్ని బాలుని కిప్పించాడు. ఆమె ఆనందానికి హద్దుల్లేవు.

ఆ పిల్లవాడు తనకి వచ్చిన బహుమానానికి సంబరపడుతూ 'అమ్మా ! ఇదిగో!' అంటూ ఆ నాణాలున్న పళ్లాన్ని తల్లి కందించాడు. ఆమె ఆనందంతో తన భర్త చెప్పిన మాటని మఱచిపోయి ఆ బంగారు నాణాల పళ్లాన్ని స్వీకరించింది.

అంతే! తాను ఋణవిముక్తుడైన కారణంగా అంతా చూస్తూండగా అప్పుడే ప్రాణాలని విడిచాడు బాలుడు. తన పుత్రునికి రాజుగారే బహుమాన మిచ్చారనే వార్త తెలిసి పరుగు పరుగున వచ్చిన తండ్రి దుఃఖం కట్టలు తెంచుకుంది.

అందుకే సంప్రదాయం తెలిసిన పెద్దలు తమ భార్యాపుత్రులకి తాము 'ఏదైనా ఈయడమే చేస్తారుగాని, వారి నుండి తీసుకోవడాన్ని' చేయరు.

## 9. ఒక కార్యాన్ని సాధించాలంటే ఏం కావాలి ?

భోజుడొకసారి సభ తీర్చి ఉండగా పండితులలో ఒక సమస్య వచ్చింది. ఒక కార్యాన్ని సాధించాలంటే కావల్సినది 'పనిముట్లు' అని కొందఱూ, 'కాదు - మనోధైర్యమూ పట్టుదలా' అని కొందఱూ, వాదించుకోసాగారు. అంతలో భోజుడు తన జీవితానుభవాన్ని పురస్కరించుకుని 'క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నో పకరణే' (కార్యాన్ని సాధించడానికి కావలసింది పనిముట్లు కాదు. మనోధైర్యమూ పట్టుదలాను) అనే సమస్యనిచ్చి దీన్ని ఒకరోజు సమయంలో పూర్తి చేయవలసిందన్నాడు.

మఱునాడు ఒక పండితకుటుంబం వచ్చింది. మొదటగా ఆ పండితకుటుంబపు పెద్ద ఇలా చదివాడు.

**'రథ స్యైకం చక్రం భుజగయమితా స్సప్తతురగా:**
**నిరాలంబో మార్గ శ్చరణవికల స్సారథి రపి।**
**రవి ర్యా త్యేవా స్తం ప్రతిదిన మపారస్య నభస:**
**క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నో పకరణే'**

'రాజా! సూర్యుణ్ణి పరిశీలిద్దాం. ఆయన రథానికి ఒకటే చక్రం. కాబట్టి ఎప్పుడైనా ఎటైనా ఒరిగిపోవడానికి అవకాశం ఉంది. ఆ రథానికి ఉండే ఏడుగుఱ్ఱాలకీ బిగించిన ఆ కళ్లేలు ఏడుపాములు. ఏ క్షణంలోనైనా ముడుచుకుపోవడానికి అవకాశం ఉన్నవిగదా పాములు.

పోనీ ఈ గుఱ్ఱాలతో ఈ కళ్లెపు తాళ్లతో ఒకేఒక్క చక్రంతో ఎక్కడికి ఏ మార్గం ద్వారా వెళ్లాలని అడిగితే 'త్రోవలేదు- ఆకాశంలో ప్రయాణించాలి' ఎప్పుడైనా పడిపోవచ్చు. ఎక్కడైనా త్రోవ తప్పవచ్చు.

పోనీ సారథి గట్టివాడైనపుడు ఈ అడ్డంకులొక లెక్కా? అనుకునే వీలులేదు. సూర్యరథానికి సారథి అయిన ఆ అనూరునికి తొడలే లేవు. అంటే బొడ్డు క్రిందినుండి ఏశరీరమూ లేనివాడన్నమాట.

ఇలాంటి వాటితోనైనా సరే సూర్యుడు ప్రతిదినమూ అంతులేని ఆకాశ మార్గంలో ప్రయాణిస్తూండడమే కాక, ఒక ఱెప్పపాటు కాలాన్ని కూడ ఆలస్యం చేయనే చేయడం లేదు. ఏరోజునా రాకండానూ ఉండడం లేదు. కాబట్టి పనిముట్లు ఉన్నా, కార్యసాధనకి ముఖ్యమైన మనోధైర్యమూ పట్టుదలా అనేవి లేనిదే పని జరగనే జరగదనే అర్థమున్న పైశ్లోకం విని రాజెంతగానో ఆనందించాడు.

వెంటనే ఆ పండితుని భార్య ముందుకొచ్చి 'రాజా! నా పూరణని కూడ దయ చేయండి' అని ఇలా చదివింది.

**'ఘటో జన్మస్థానం మృగపరిజనో భూర్జవసన:**
**వనే వాస: కం దాదిక మశన మేవంవిధగుణ:।**
**అగస్త్య: పా థోధిం య దకృతక రాంభోజకుహరే**
**క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నో పకరణే ॥'**

'రాజా! అగస్త్యుడనే మహర్షి ఉన్నాడు గదా ! ఆయన పుట్టుక కుండలో జరిగింది. ఎప్పుడూ అరణ్యంలోనే ఉండే ఆయనకి మృగాలే స్నేహితులు. చెట్టునారలే వస్త్రాలు. కందమూల ఫలాలే ఆహారం. అయినా మొత్తం సముద్ర జలాన్ని అలా ఆపోశనం పట్టెయ్యగలిగాడంటే కారణం 'తాను ఆ పనిని చేయగలననే మనోధైర్యమూ పట్టుదలా మాత్రమే'.

గొప్పవైన రాజవంశాల్లో పుట్టి, బలిష్ఠులైన రాజపుత్రుల సహాయం కలిగి, విలువైన చీనిచీనాంబరాలని కడుతూ, మహాసౌధాలలో నివసిస్తూ, ఉత్తమ రాజాన్నాలని తినే ఏ క్షత్రియుడూ ఇలా సముద్రాన్ని ఆపోశన పట్టలేకపోయాడంటే కారణం మరేమిటుంటుంది ? మనోధైర్యమూ పట్టుదలా లేకపోవడమే ! అనే అర్థమున్న పైశ్లోకం విని భోజుడు మఱింత సంతోష పడ్డాడు.

వెంటనే ఈ పండితుని పుత్రుడు లేచి 'రాజా! నేనెలా పూరిస్తానో కొద్దిగా చిత్తగించండి' అంటూ ఇలా చదివాడు.

**'విజేతవ్యా లంకా చరణతరణీయో జలనిధి:**
**విపక్ష: పౌలస్త్యో రణభువి సహాయా శ్చ కపయ: ।**
**పదాతి ర్మర్త్యో z సౌ సకలమవధీ ద్రాక్షసగణం**
**క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నో పకరణే॥'**

'రాజా! శ్రీరామచంద్రుని వృత్తాంతం ఎవరికి తెలియదు గనుక! ఎక్కడో సముద్రానికి అవతల ఒడ్డున ఉన్న సముద్రాన్ని దాటాల్సి ఉంది. పోనీ 'సముద్రానికి 'వారధి' ఏమైనా ఉందా ?' అంటే హుళక్కి. కేవలం నడుస్తూనే సముద్రాన్ని దాటవలసి ఉంది.

ఎదురుగా ఉండే శత్రువు సాక్షాత్తూ పులస్త్యబ్రహ్మవంశపు వాడైన రావణుడు. పోనీ రావణుణ్ణి మట్టుపెట్టడానికి 'గట్టి సైన్య సహాయం ఉందా ?' అని ఆలోచిస్తే క్షణానికి ఒకమాఱు మతి చలించే లక్షణమున్న కోతులే, సహాయంగా ఉండే సైన్యం.

ఎన్నో మాయలూ అదృశ్య యుద్ధమూ తెలిసిన రావణుడంతటివానికి యుద్ధంలోఎదురుగా నిలబడదలచిన రామునికి మాయలు లేనూలేవు. తెలియనూ తెలియవు. ఆ మాయా విధానం తనకి ఇష్టమూ లేదు. ఇక రావణుడు రాక్షసుడు కాగా, రాముడు రాక్షసులతో జన్మవిరోధం ఉన్న మనుష్య జాతివాడు. నడక మాత్రమే

ప్రయాణ సాధనంగా కలవాడు. అయినా రాక్షసజాతి నంతటినీ జయించాడంటే కారణం 'కార్యసాధనంలో మనోధైర్యమూ పట్టుదలా మాత్రమే' అనే అర్థమున్న పైశ్లోకం విని భోజుడు అబ్బుర పడ్డాడు.

వీరంతా చదివిన దాన్ని విని భోజుడు పరమానందపడుతూంటే పండితుని కోడలు తన పూరణని చదవ దలచి రాజుని ప్రార్థించి ఇలా చదివింది.

**'ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చంచలదృశా**
**దృశాంకోణో బాణః సుహృదపి జ డాత్మా హిమకరః।**
**స్వయం చైకో z నంగః సకలభువనం వ్యాకులయతి**
**క్రియాసిద్ధి స్సత్వేభవతి మహతాం నో పకరణే ।'**

'ఓ! రాజా! తుమ్మెదలే వింటినారిగా, అతిసుకుమారమైన పూలే బాణాలుగా, ఎప్పుడూ వేడి ఏ మాత్రమూ లేక చల్లనిదనంతో ఉండే చంద్రుడు స్నేహితుడుగా కలిగి, తనకంటూ ఒక శరీరమే లేని మన్మథుడు సకలభువనాన్నీ కదిల్చి వేయగలుగుతున్నాడంటే దీనిక్కారణం కార్యాన్ని సాధించగలననే మనోధైర్యమూ పట్టుదలలే సుమా!' అనే అర్థమున్న పైశ్లోకం విన్న భోజుడు, ఆ పండిత కుటుంబం మొత్తానికి వారు చదివిన ప్రతిశ్లోకంలోని అక్షరానికి లక్ష చొప్పున బహూకరించి పంపాడు.

## 10. ఓసి 'రండా !' నేనెవర్ని ?

సంస్కృతంలో ఉత్తరరామచరితమనే నాటకాన్ని వ్రాసి ప్రసిద్ధుడైన భవభూతి మహాకవీ-దశకుమార చరిత్రమనే చక్కని వచన కథని ఒక నవల పద్ధతిలో వ్రాసి ప్రసిద్ధుడైన దండి మహాకవీ-ఇటూ అటూ కూర్చుని ఉండగా కాళిదాసమహాకవి వారి మధ్యలో కూచుని ఉన్నాడుట.

అంతలో అక్కడికి సరస్వతీదేవి వచ్చింది. పండితులకి ఓ చక్కని ఆలోచన వచ్చి 'సరస్వతీమతల్లీ! ఈ ముగ్గురిలో ఎవరు ఎంత పాండిత్యం కలవారో, దేంట్లో పండితులో నీముఖతః వినాలనుంది చెప్పవా?' అని నమస్కరించి ప్రశ్నించారట.

ఆమె ఆ ముగ్గురినీ అనుగ్రహపూర్వకంగా చూస్తూ "కవి ర్దండీ కవి ర్దండీ భవభూతి స్తు పండితః- 'దండి' అనే పేరున్న ఈయన మంచికవి.

నిస్సంశయంగా మహాకవి. 'భవభూతి' అనే పేరున్న ఈయన చక్కని పండితుడు. సందేహమే లేదు." అని అంతమాత్రమే చెప్పి ఊరుకుందిట.

తన ప్రక్కలనున్న ఇద్దఱినీ గురించి చెప్పి తన గురించి ఏమీ చెప్పలేదనే కోపం మిన్నుముట్టిన కారణంగా కాలిదాసు బిగ్గరగా 'కోஉహం రండే?' (ఓసిరండా మఱి నేనెవర్ని?) అన్నాడు.

ఆమె ఏమాత్రం కోపగించుకోకండా 'త్వమే వాహం త్వమే వాహం త్వమే వాహం న సంశయః' (నువ్వే నేను. నేనే నువ్వు. నువ్వే నేను. ఇందులో సందేహం లేదు) అంది. అప్పటినుండీ కాలిదాసమహాకవిని పురుషరూపంలో ఉన్న సరస్వతి (పుంభావ సరస్వతి) అని అంతా ఆరాధించేవారు. దేవీ అనుగ్రహం ఉన్నవాడు గనుకనే అంతమాటతో ఆమెని 'రండా!' అని నిర్బంధించి తనని గూర్చి చెప్పించుకోగల్గాడు కాలిదాసు.

## 11. చందనంలా చల్లబడ్డాడు అగ్ని.

సంస్కృత సాహిత్యం అనగానే కాలిదాసమహాకవి గుర్తుకి రాకపోతే దాన్ని మహాపచారంగా భావించక తప్పదు. భోజుని ఆస్థానంలోని కవులంతా 'లోకంలో ప్రత్యక్షంగా తాము చూచినవాటిని గుఱించి అడిగితేనే' వాటికి సమాధానాన్ని కవిత్వంలో చెప్పగలుగుతూండేవారు. కాలిదాసు మాత్రం సరహస్యంగా ఉండేవిశేషాలనైనా ఎవరైనా సరే అడిగితే, ఆ అడిగినవారి అభిప్రాయాని కనుగుణంగా తడుము కోకుండా చెప్పగలుగుతూండేవాడు. దానిక్కారణం దేవీ అనుగ్రహమే తప్ప వేఱుకాదు.

ఒకసారి భోజుడే రాత్రివేళ నగరాన్ని మాఱువేషంలో పరిశీలిస్తూంటే ఒక ఇంట్లో ఒక చిత్రమైన దృశ్యం కన్పించింది. ఒక స్త్రీ తొడపై తలపెట్టుకుని భర్త నిద్రిస్తున్నాడు. ఆమెకున్న రెండేళ్ల పిల్లవాడు దగ్గరగా ఉన్న పొయ్యి వద్దకి వెడుతూ ఆ మంటలో చెయ్యిపెట్టి మంటని పట్టుకోవాలను కుంటున్నాడు. ఆ పిల్లవాణ్ణి ఆపడానికి ఆమె అఱచినా, లేక వాణ్ణి వెనక్కి లాగడానికి లేచినా, తన భర్తనిద్రకి భంగమయ్యే ప్రమాదముందని ఆ పతివ్రత సంకోచిస్తూ, ఇటు పిల్లవాణ్ణీ అటు భర్తనీ చూస్తూ ఏమీ చేయలేక అగ్నిదేవుణ్ణి మౌనంగా ప్రార్థించడం మొదలెట్టింది.

మార్గంలో నిలబడి భోజుడు అలా పరిశీలిస్తూనే ఉండిపోయాడు 'ఏం జరుగుతుందా?' అని. అంతే ! క్షణంలో ఆ పిల్లవాడు నిప్పులో చేతిని పెట్టి అగ్నిజ్వాలలతో ఆడుకోవడం ప్రారంభించాడు. కొ సేపటికి భర్తకి మెళుకువ వచ్చి ఆ పిల్లవాణ్ణి వెనక్కిలాగి, జరిగిన సంఘటనకి రపోయాడు. తన రాజ్యంలో నిప్పుని కూడా చల్లబఱచగల శక్తి ఉన్న పతివ్రతలు ్నరు గదా! అని భోజుడెంతో గర్వపడ్డాడు.

ఈ విషయం కిందటిరాత్రి నగర సంచారానికి వెళ్లిన తన ఒక్కనికే తెలుసు. ఈ విషయాన్నే సమస్యగా ఇచ్చి కాలిదాసుని పూరించమంటే ఎలా పూరిస్తాడో గమనించాలనిపించింది భోజునికి. మఱునాడు కాళిదాసు సభకి వస్తున్న వేళలోనే 'మహాకవీ! చందనంలా అగ్ని చల్లబడ్డాడు సుమా !' అనే అర్థం వచ్చే 'హుతాశన శ్చందన పంకశీతలః !' అనే సమస్య నిచ్చాడు భోజుడు కాలిదాసుకి.

క్రిందటి రాత్రి 'తానుకూడా భోజునితో ఉండి ఆ సంఘటనని కన్నులారా కాలిదాసు చూచాడా?' అన్నట్టు సరిగా ఆ సంఘటనని స్పష్టంగా శ్లోకంలో వర్ణించి ఇలా కాలిదాను చెప్పాడు ఏమాత్రమూ తడుముకోకుండా-ఆలోచించకుండా.

**'సుతం పతంతం ప్రసమీక్ష్య పావకే**
**న బోధయామాస పతిం పతివ్రతా ।**
**విశేషత స్తత్పతిభక్తి గౌరవాత్**
**హు తాశన శ్చందన పంకశీతలః॥'**

'తనపిల్లవాడు అగ్నిలో పడబోతున్నాడని తెలిసి కూడా ఒక పతివ్రత, తన భర్తకి నిద్రాభంగమౌతుందని నిద్ర లేపనే లేదు. 'ఆ అగ్నిదేవుడు ఆమె పతిభక్తిలోని గొప్పదనాన్ని గుర్తించి ఆమోదించాడా?' అన్నట్టు తానూ మంచిగంధంలా చల్లబడిపోయాడు అగ్ని' అని దీని అర్థం. పై శ్లోకాన్ని విన్న రాజు కాలిదాసుకి సాష్టాంగపడి కాలిదాసుని సాక్షాత్ దేవీస్వరూపంగా భావించడమే కాక విశేషంగా సంమానించాడు కూడ.

## 12. వినాయకుని బొడ్డులో వేలు ఊడిరాలేదా ? ఎందుచేత ?

ఒకసారి కాలిదాసు దేవీ ఆలయానికి వెళ్లాడు. అక్కడ అనేక మహాకవుల విగ్రహాలు కూడ ఉన్నాయి. అందటికీ అతిగౌరవంగా నమస్కరిస్తూ

వస్తూన్న కాళిదాస మహాకవికి, వ్యాసుని విగ్రహం చూడగానే కొంత నవ్వులాట అన్పించింది. అన్పించడమే కాదు... వేళాకోళం చెయ్యాలనికూడ అన్పించింది.

సంస్కృత మహాభారతం రాసిన వ్యాసుడు తన గ్రంథంలో 'చ' (మరియు - కూడా - ఇంకా) అనే పదాన్ని ఎక్కువగా కావ్యంలో వాడడం కాలిదాసుకి నవ్వులాటగా అన్పించి 'చకారకుక్షీ!' (నీ పొట్టనిండా 'చ' కారాలే ఉన్నాయి అందుకే కావ్యంలో అన్ని 'చ' కారాలని వాడావు) అంటూ ఆ విగ్రహం బొడ్లో తన చూపుడు వేలుని పెట్టి పొడుస్తూ వెటకారంగా నవ్వాడు.

అంతే ! ఆ వేలు ఊడిరాలేదు. విగ్రహంగా ఉన్న వ్యాసునికి కోపం రాలేదుగాని కాలిదాసుకున్న అహంకారం మాత్రం తనకి నచ్చక అలా ఊడిరానీయలేదు. కాలిదాసు తన వేలిని లాగుకొనే ప్రయత్నంలో ఉండగా వ్యాసుడే 'కాలిదాసా! నన్ను 'చకారకుక్షి!' అని అవమానకరంగా మాట్లాడావు గదా ! సరే ! ద్రౌపది భర్తలు ఎంతమందో వారిని మొత్తాన్ని ఒకే శ్లోకంలో చెప్తూ ఎక్కడా 'చ' కారాన్ని వాడకు' అన్నాడు.

'ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు మఱియు సహదేవుడు అనే ఐదుగురూ ద్రౌపదికి భర్తలు' అని అర్థం రావాలి. ఐదుగు పేర్లని ఒకే శ్లోకంలో వాడేప్పుడూ, అందునా ఆ ఐదుగురూ ద్రౌపదికి భర్తల వ్రాసేప్పుడూ 'చ' కారం లేకుండా వ్రాయడమంటే అసాధ్యమే మఱి!. అందు వ్యాసుడు కాలిదాసుకి ఇలాటి పరీక్షని పెట్టాడు. కాలిదాసు ఏమంటాడో చూద్దామనీ తన ఓటమినంగీకరిస్తాడనీ వ్యాసుడు భావించాడు.

అంతలోనే తడుముకోకుండా కాలిదాసు ఒక శ్లోకాన్ని 'చ' కారం లేకుండా వ్రాసి ద్రౌపది భర్తల విధానాన్ని ఇలా చెప్పనే చెప్పాడు.

**'ద్రౌపద్యాః పాండుపుత్రా స్తే పతిదేవర భావుకాః ।**
**న దేవరో ధర్మరాజః సహదేవో న భావుకః ॥'** అని.

ఓ వ్యాసమహర్షీ విను! ద్రౌపదికి సంవత్సరానికి ఒకరు చొప్పున ఐదుగురు భర్తలున్నారు. ఈ ఐదుగురిలో ధర్మరాజు ఎప్పుడూ బావమఱిది కాడు. సహదేవుడు ఎప్పుడూ బావ కాడు. ఎప్పుడు ఎవరామెకు భర్తఅయితే తన భర్తకంటె పూర్వం పుట్టినవాళ్లు ఆమెకు బావలు. తరువాతి వారంతా బావమఱదులు' అనే అర్థం వచ్చేలా చెప్పిన పైశ్లోకాన్ని వ్యాసుడు విని పరమానందపడి కాలిదాసు వేలిని తన బొడ్డునుండి ఊడేలా చేసాడు.

ఇంత మాత్రం చేత వ్యాసునికి కవిత్వం రా(లే)దని గాని, వ్యాసుని కంటె కాలిదాసే గొప్పవాడనిగాని నిర్ణయించ కూడదు. 'వ్యాసునంతటి వాని ఆమోద ముద్రని కూడ పొందిన వాడు కాలిదాసు' అని భావించాలి.

## 13. భోజుని భవనం - వ్యాకరణ పిశాచ గృహప్రవేశం

వచ్చే పోయే కవులూ, అతిథులూ, రాజులూ ... ఇలా ఎక్కువ మంది తన వద్దకి వచ్చి పోతూండడంతో భోజునికి తానున్న మందిరం సరిపోవడం లేదని అన్పించి వెంటనే నూతన భవనాన్ని ప్రారంభించి సంవత్సరంలోపునే భవనాన్ని ప్రవేశించడానికి సిద్ధం చేసాడు. ఇక గృహప్రవేశం చేయాలని భావిస్తూ ఉన్నవేళ, ఆ భవనాన్ని కట్టిన తాపీవారూ వడ్రంగులూ.... అంతా 'ఆ భవనంలో బ్రహ్మ రాక్షసుడు గాని పిశాచం గాని ఉన్నారనీ, వారు భవనంలో ఎవరు ఉన్నా పనిచేస్తున్నా తమ సందేహాలతో ప్రాణం తీస్తారనీ, కాబట్టి ఏదైనా చేయించవలసి ఉందనీ' భోజునికి చెప్పారు.

ఈ కథ నమ్మడానికీ నమ్మకపోవడానికీ కూడ వీలులేని విధంగా లోకానికి ప్రచారం అయింది. భోజుడు ఎందఱో భూతవైద్యులని రప్పించి జపాలూ, తపాలూ చేయించాడు గాని వాటివల్ల కూడా ఏ ప్రయోజనమూ లేకపోయింది.

ఆ బ్రహ్మరాక్షసుడు ఆ భవనంలో ఎవరైనా నిద్రించడానికి రాగానే ఒక సమస్య నిచ్చి మిగిలిన మూడుపాదాలనీ చెప్పవలసిందంటూండేవాడు. లేదా వ్యాకరణ సూత్రాన్నిచ్చి ఆ సూత్రాన్ని పద్యపాదంలో ఉంచి వ్యాకరణంలో ఉన్న దాని అర్థంతో కాక సాహిత్యపరంగా భావాన్ని ఇమిడ్చి శ్లోకంలో చెప్పవలసిందంటూండేవాడు. ఇలా కాలం సాగుతూంటే, తన కిష్టమైన తీరులో శ్లోకం చెప్పకపోయినా, చెప్పింది సరికాకపోయినా, వెంటనే ఆ చెప్పినవారిని మ్రింగడం కూడ ప్రారంభించాడు బ్రహ్మరాక్షసుడు. దానితో రాజైన భోజునికి మనస్తాపం ప్రారంభమైంది.

చేయగల్గిందేమీ తోచక , దేవీ ఉపాసకుడైన కాలిదాసుని పిలిచి మొత్తం కథని విన్పించి 'నువ్వే మాకు దిక్కు' అన్నాడు భోజుడు. కాలిదాసు కూడ 'పండితునిగా కన్పించే పిశాచం'తో మాట్లాడడాన్ని ఒక సవాలుగానే తీసుకుని భోజునితో తన సంసిద్ధతని వ్యక్త పఱిచాడు.

ఒక పక్క కాలిదాసుకి ఏం జరిగితే తనని లోకమంతా ఏమంటుందోననే భయం, మరో పక్క కాలిదాసు దేవీ అనుగ్రహవంతుడు గదా ! అనే పెనుధైర్యమూ భోజునికి కలిగాయి. ఏమైనా కాలిదాసే తగిన వాడని నిర్ణయించి ఆ రాత్రి భవనంలో ఉండేందుకు ఏర్పాట్లని చేయించాడు భోజుడు.

సూర్యాస్తమయం కాగానే తాను చేయవలసిన ప్రత్యేక జపాలని కాలిదాసు ముగించుకుని భవనంలో పరున్నాడు. మొదటి జాము ఇంకా కాకుండానే భయంకర పిశాచ రూపం వచ్చి 'కవీ! ప్రతి జాములోనూ నేనొక సంస్కృత వ్యాకరణ సూత్రాన్ని చెప్తాను. ఆ సూత్రంలోని విశేషాన్ని కవిత్వంలో పొందుపఱుస్తూ చెప్పాలి. నాలుగు జాముల్లో ఏ జాములోనైనా కవిత్వాన్ని సరైన తీరులో నువ్వు చెప్పకపోయినట్లైతే నీ జీవితం కూడ ఇంతతో సరి' అని ముగించాడు బ్రహ్మరాక్షసుడు.

తప్పక చెప్పడానికి ప్రయత్నిస్తా నన్నాడు కాలిదాసు. మొదటి జాము కాగానే "బ్రహ్మరాక్షసుడు 'సర్వస్య ద్వే' (అంతటికీ మూలం ఇద్దరే) అనే వ్యాకరణ సూత్రాన్ని చెప్పి, ఈ వ్యాకరణాన్ని చక్కని సాహిత్యంతో ముడేసి చెప్పాలి' అన్నాడు. ఈ బ్రహ్మరాక్షసుడు సాహిత్యమంటే అభిరుచి ఉన్న వ్యాకరణ పండితు డయ్యుండాలని అన్పించింది కాలిదాసుకి. ఎవరైతేనేం ? పూరిస్తాననుకొని కాలిదాసు

**'సర్వస్య ద్వే సుమతికుమతీ సంప దాపత్తిహేతూ'** అని చెప్పాడు. (శుభానికీ అశుభానికీ కారణం సజ్జనుడూ దుర్జనుడూ అనే ఈ ఇద్దఱి మంచిబుద్ధీ చెడుబుద్ధీ అనేవి మాత్రమే).

పూరణకి ఆనంద పడ్డ బ్రహ్మరాక్షసుడు రెండవ జాములో మళ్లీ వస్తానని చెప్పి, అలాగే వచ్చి 'ఏకో గోత్రే' (వంశానికి ఒక్కడే) అనే సూత్రాన్ని చెప్పాడు. కాలిదాసు తడుముకోకుండా

**'ఏకో గోత్రే ప్రభవతి పుమాన్ యః కుటుంబం బిభర్తి'** అని చెప్పాడు. (కుటుంబపు బరువు బాధ్యతల నన్నింటినీ భరించే వ్యక్తి ఎవరో, అతడే వంశంలో నిజంగా చెప్పుకోదగినవాడు. అతణ్ణే 'పూర్ణవ్యక్తి' అనాలి.)

దీనిక్కూడా ఆనంద పడ్డ బ్రహ్మరాక్షసుడు మూడవ జాములో వచ్చి 'వృద్ధో యూనా' (వృద్ధుడు యువకునితో కలిసి తిరిగినట్లయితే) అనే వ్యాకరణ సూత్రాన్ని సమస్యగా ఇచ్చాడు. చెప్పాడు కాలిదాసు ఏమాత్రమూ ఆలోచించకుండానే.

'వృద్ధో యూనా సహ పరిచయా త్త్యజ్యతే కామినీభిః' అని చెప్పాడు. (వృద్ధుడు యువకునితో కలిసి తిరుగుతున్నవాడైనట్లైతే ఏ స్త్రీలూ ఆ వృద్ధుణ్ణి గౌరవ భావంతో చూడరు. దరిచేరరు. అంతే కాదు. తమ భర్తకంటె వయసుతక్కువ వానితో పరిచయం ఏర్పడిన స్త్రీలు తమ భర్తలని విడిచివేస్తారు కూడ).

కాలిదాసు పూరణలతో ఆనందపడుతున్న బ్రహ్మరాక్షసుడు నాలుగవ జాములో 'స్త్రీ పుంవచ్చ' (స్త్రీ ఎక్కడైనా పురుషునిలా సంచరిస్తే) అనే సూత్రాన్ని చెప్పాడు. కాలిదాసు సంతోషంతో '**స్త్రీ పుంవచ్చ ప్రభవతి యదా త ద్ధి గేహం వినష్టమ్**' అని పూరించాడు. (ఏ ఇంట స్త్రీ, ఒక పురుషునిలా అధికారాన్ని చెలాయిస్తూ ప్రవర్తిస్తుందో ఆ ఇల్లు ధ్వంసమౌతుంది)

పైన బ్రహ్మరాక్షసుడు ఇచ్చిన నాలుగు సమస్యలకీ వ్యాకరణంలో అర్థాలు వేఱు. అయినా ఆ సూత్రాలని వ్యాకరణ పరంగాకాక, వాటిని సాహిత్య పరంగా చక్కనైన విధంగా కాలిదాసు పూర్తిచేసిన కారణంగా ఆ బ్రహ్మరాక్షసుడు తన విడిదిని మాఱుస్తూ కాలిదాసుని ఎంతో ప్రశంసించాడు. మఱెప్పుడూ ఆ భవనం జోలికి రానని వెళ్లిపోయాడు. కాలిదాసు ప్రతిభని గుర్తించిన భోజుడు, విశేషంగా కాలిదాసుని సన్మానించాడు.

## 14. నలుగురు మహాకవులు కలిసి చెప్పిన శ్లోకం

ఒక్కొక్క మహాకవి ఒక్కొక్క తీరు సౌందర్యంతో శ్లోకాన్ని చెప్తున్నారు గదా ! 'అసలు ఒకే శ్లోకాన్ని కొందరు మహాకవులు కలిసి చెప్తే ఎలా ఉంటుంది ?' అన్పించింది భోజునికి. అంతే ! కాలిదాస - భవభూతి - దండి మహాకవులని ఆనాటి సాయంకాలపువేళకి మందిర ఉద్యానవనానికి రావలసిందిగా కబురు చేసాడు. వారు రాగా సగౌరవంగా కూర్చుండబెట్టాడు భోజుడు.

'మహాకవులారా ! ఇపుడు సూర్యుడు చక్కగా అస్తమిస్తూ అదో వింతగా గోచరిస్తున్నాడు గదా! ఈ సూర్యుణ్ణి మనం నలుగురం వర్ణిస్తూ ఒక శ్లోకాన్ని వ్రాద్దాం. ముందుగా నేను చెప్తాను' అంటూ

**పరిపతతి పయోనిధౌ పతంగః**

('సూర్యుడు ఆ పడమర సముద్రంలోనికి పడిపోతున్నాడు ') అని చెప్పాడు భోజుడు.

సరసిరుహ ముదరేషు మత్తభృంగః

('రోజురోజంతా వికసించిన పద్మాలలోని మకరందాలని తాగితాగి ఉన్న తుమ్మెద , అదే పద్మంలో నిద్రకోసం పక్కని వేసుకుంటోంది) అని చెప్పాడు దండి.

ఉపవనతరుకోటరే విహంగః

('దగ్గఱగా ఉన్న ఉద్యానవనాలన్నింటిలోని చెట్టు తొఱ్ఱలలోకీ, అంటే తమ తమ ఇళ్లలోనికి పక్షులు చేరుతున్నాయి') అని పూరించి చెప్పాడు భవభూతి.

యువతి జనేషు శనై శ్శనై రనంగః॥

('యౌవనంలో ఉన్న స్త్రీలలోకి మెలమెల్లగా మన్మథుడు ప్రవేశిస్తున్నాడు' ) కాళిదాసు పూరించాడు.

భోజుడుమొదటగా చెప్పిన శ్లోక పాదంలో ఉన్న 'పతంగః' అనే చివరి మాటలోని 'ంగః' అనే అంత్యప్రాసాన్ని ఎవరూపాడుచేయకుండా అందఱూ ఆ క్రమాన్ని పాటించడం కూడా ఎంత విశేషం! ఔచిత్యవంతమూనో కదా !

'నిజంగా కాళిదాస భవభూతి దండి భోజరాజులు ఒకే కాలంవారా ?' అని ఆలోచిస్తే ఒక ఇబ్బందే. కాబట్టి 'ఈ శ్లోకం అబద్ధమా' ? అనుకోకూడదు. ఆయా కవుల కవితాశైలీ పట్టుబడీ ఎలా ఉంటుందనేది తెలియజేయడానికి ఈ శ్లోకం ఉపయోగిస్తుందని అలానైనా భావించవచ్చు.

అలాగే భవభూతి కాళిదాస దండి మహాకవులని గూర్చి సరస్వతీదేవి తన అభిప్రాయాన్ని తెల్పిందని చెప్పిన విషయం కూడా అసత్యమేనా ? అనుకోనక్కఱ లేదు. వారంతా సరస్వతీదేవిని సాక్షాత్కరించుకోగల దిట్టలు కాబట్టి, ఎవరు ఏ కాలంలోని వారైనా, ఆ ముగ్గురూ ఒకే స్వర్గంలో ఉన్నప్పుడు జరిగిన సంఘటనగా నైనా దీన్ని భావించడం దోషం కా (బో)దు. కారణమేమంటే ఆ సరస్వతీదేవి చేసిన నిర్ణయాన్ని బట్టి ఆ మహాకవుల లక్షణాలు అలా అచ్చుగుద్దినట్లు మనకి ఇప్పుడూ తెలుస్తూ ఉండడమే.

## 15. దొంగలైనా వీరికి శిక్ష లేదుట !

తాను సర్వరాజ భోగాలనీ అనుభవించగల అవకాశం కలవాడే అయినా భోజుడు మాత్రం రాత్రివేళల్లో తఱుచుగా మాఱువేషం వేసుకుని తిరుగుతూ నగర ప్రజల పరిస్థితిని గమనిస్తూండేవాడు.

ఒకనాటి అర్ధరాత్రి ఇలాగే తిరుగుతూన్న వేళలో ఒక ఇంటిలో దొంగతనం జరుగుతూన్నట్టు తనకి తోనిపించింది. ఆ యింటిలోని వారెవ్వరూ కొన్ని రోజులుగా ఊళ్లో లేనట్టుంది. ఆ కారణంగా ఈ దొంగలకి ఈ ఇల్లు మఱింత అనుకూల మన్పించిందని భోజరాజుకి తోచింది. ఇంట్లో ఎవరూ లేని కారణంగా వాళ్లు చేయవలసిన దొంగతనాన్ని చాల శ్రద్ధగా చేసి ఆ దొంగసొత్తుని ఊరి వెలుపల ఉన్న మామిడి తోపులోనికి పట్టుకుపోయి పంచుకుపోవాలని నిశ్చయించుకుని బయటికి రాబోయేసరికి, నగరంలో గస్తీ తిరుగుతూన్న రక్షక భటుల నగారా ధ్వనులు వినిపించాయి.

వెంటనే ఆ ఇద్దఱుదొంగలూ తాము దొంగిలించిన సొమ్ముని అక్కడే పంచుకుని రెండు మూటలుగా చేసుకోవాలని నిర్ణయించుకుని అలా భాగాలు చేసుకుంటూ వాళ్లలో వాళ్లు ఇలా మాట్లాడుకోసాగారు. గోడకి చెవినానించి వింటూన్న భోజుణ్ణి వారు గమనించలేదు. భోజునికి ఇలా విన్పించ సాగింది.

'శకుంతా ! ఎప్పుడూ దొఱకనంత డబ్బు ఈ రోజున మనకి లభించింది కదా! నీ వాటా సొమ్ముతో ఏం చెయ్యాలనుకుంటున్నావు ?' అని మరాలుడనే దొంగ అడిగాడు.

'మరాలా ! వేదాలు నాలుగనే మాటని ఎప్పుడైనా విన్నావా ? ఒక పుస్తకమంటూ లేక ఒక గురువు చెప్తూంటే దాన్ని అలా బుద్ధిలో పెట్టుకుని మననం చేసుకుంటూ రోజూ లేచి వల్లె వేసుకుంటూ తన గురువు నుండి తానూ, తన నుండి తన శిష్యునికీ ... ఇలా పరంపరగా ఆ వేదవిద్యని తెస్తూ ఆ వేద సంపదని లోకంనుండి నిష్క్రమించకుండా శ్రమిస్తూన్న వేదపండితులకి ఈ ధనాన్ని పంచుదామనుకుంటున్నాను. ఇంకేదైనా పనిచేస్తే రాగల ఎక్కువ ధనాన్ని దృష్టిలో పెట్టుకోకుండా, తమ జీవితాన్ని వేదాలకే అంకితం చేసిన ఆ పండితులకి, వారు నష్టపోతున్న ధనాన్ని ఈ విధంగా ఈయడం ధర్మమే అని నాఅభిప్రాయం' అన్నాడు శకుంతుడు.

'శకుంతా ! నువ్వన్నది నిజమే కావచ్చు. అయితే నువ్వు సొంతంగా ఆర్జించిన సొమ్ముని దానం చేయడం సరిపోతుందేమోగాని, ఇలా తస్కరించిన ద్రవ్యాన్ని ఈయడం ధర్మమౌతుందా ? అదీ వేదపండితులకి?' అడిగాడు మరాలుడు సందేహంతో.

"మరాలా!

**దానం భోగో నాశ స్త్రి స్రో భవంతి గతయో హి విత్తస్య।**
**యో న దదాతి, న భుంక్తే, తస్య తృతీయా గతి ర్భవతి ॥**

ఈ శ్లోకాన్ని ఎప్పుడైనా విన్నావా ? ఏ వ్యక్తైనా ధనాన్ని సంపాదించవలసినదేనట. తన కుటుంబాన్ని నడుపుకోడానికి మించి ఆర్జించవలసినదేనట. అయితే ఆ మిగిలిన ద్రవ్యాన్ని అర్హులైనవారికి దానం చేయాలిట. లేదా తానే సక్రమమైన పద్ధతిలో అనుభవించాలిట. ఈ రెండూ చేయ(లే)ని వాని ధనానికి - ఇదిగో ! ఈ విధంగానే నష్టం జరుగుతుందిట. ఈ ఇంటి వాడున్నాడే ! పిల్లికి బిచ్చం పెట్టడు. ఎక్కడ అదిలిస్తే ఒక అన్నపు మెతుకు నేలనపడి ఆ కాకి తినిపోతుందోనని కాకిని కూడా ఎంగిలి చేత్తో అదిలించడు. అలాగని తాననుభవిస్తాడా ? అదీలేదు. త్రోవన పోతుంటే ఎవరైనా వీణ్ణి చూచి 'పాపం బిచ్చం వేద్దాం !' అనుకునేలా కన్పిస్తాడు.

అందుకే వీని ఇంటికి ముహూర్తాన్ని పెట్టి నిన్ను పిలిచాను. ఇక 'సొంతంగా ఆర్జించి దానం చేస్తే ఫలితం దక్కుతుంది గాని ఇలా దొంగసొత్తుని దానం చేయడమా ?' అన్నావే ! విను. ఇలాటి నికృష్టుని ఇంట దొంగతనాన్ని చేసేది నా కోసం కాదు. వేదాన్ని ఉద్ధరిస్తూన్న వేదపండితుల కోసం. దురదృష్ట వశాత్తూ దొంగగా దొరికితే శిక్ష మాత్రం వారికి కాదు. నేననుభవించడం కోసం. ఈ అపహరించిన ద్రవ్యంలో చిల్లిగవ్వని నేను తాకను'' అన్నాడు శకుంతుడు.

భోజుని కంట ఆనందబాష్పాలు తిరిగాయి. మరాలుడు ఏం చెప్తాడోనని ఇంకా శ్రద్ధగా చెవులు రిక్కించుకుని వినసాగాడు. అంతలో శకుంతుడు మరాలుణ్ణి అడిగాడు 'దొంగసొత్తుని నువ్వేం చేయదలిచా'వని.

'శకుంతా ! ఈ పురాణశ్లోకాన్ని నువ్వు విన్నావు గదా !

**'మరణం మంగలం యత్ర దర్శనం పాపనాశనమ్ ।**
**కౌపీనం యత్ర కౌశేయం సా కాశీ కేన మీయతే ?'**

ఎక్కడైనా ఎవరైనా మరణిస్తే అది అశుభమే కాని కాశీలో మరణిస్తే అది ఎంతో పుణ్యప్రదం. అలాగే శ్మశానాన్ని ఎక్కడైనా మనం చూస్తే అది అశుభమే కాని మహాశ్మశానమనే పేరున్న కాశీని చూస్తే అది పాపాలని నశింప చేస్తుంది. ఎక్కడైనా గోచి ధరించిన వ్యక్తి కన్పిస్తే, మనం అతణ్ణి పేదవాడుగా నిరాదరణ చేస్తాంగాని కాశీలో గోచిపెట్టిన ఏ సిద్ధయోగి అయినా కన్పిస్తే అతడు పట్టు పీతాంబరాలని

ధరించిన విష్ణువుతోనూ, అష్టైశ్వర్యాలకీ అధిపతి అయిన శివునితోనూ సమానుడు. అలాటి కాశీ క్షేత్రాన్ని మరే క్షేత్రమూ పోలదు.

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే నా తలిదండ్రులు బాగా వృద్ధులు. నేను వారిని కాశీకి తీసుకుపోగలిగినంత సంపన్నతతో లేను. మాకెఱిగిన ఒక కుటుంబం కాశీకి పోతోందని తెలిసింది. మా తలిదండ్రులనీ ఆ కుటుంబాన్నీ కాశీకి ఈ మొత్తం ద్రవ్యంతో పంపించాలనేది నా తలంపు. ఆ వెళ్లే కుటుంబం కూడా కాశీ వెళ్లగలిగినంత స్తోమత కలిగింది కాదు. అందుకని ఈ విధమైన ఏర్పాటు చేయదలిచాను' అన్నాడు మరాలుడు.

గోడ ప్రక్కన నిలబడి ఉన్న భోజునికి శరీరం పులకరించింది. 'ఆ ఇంటి యజమాని ఎవరా ?' అని క్షణకాలం ఆలోచించాడు. శకుంతుడూ మరాలుడూ అనుకున్నట్టు గానే వాడు వట్టిలోభి. రెండుమూడు పర్యాయాలు పన్నులు చెల్లించినందుకుగా రాజదండనాన్ని పొందినవాడే. మంచి సంపన్నుడే అయినా నిరుపేదలా తిరుగుతూంటాడు. ఇదంతా గమనించి, బుద్ధితో బాగా ఆలోచించి, ధర్మకార్యాల నిమిత్తమై దొంగతనాన్ని చేస్తూన్న ఇద్దఱినీ అసలు విచారించనే అక్కఱలేదని తీర్మానించుకుని అక్కడినుండి వెళ్లిపోయాడు భోజుడు.

సద్బుద్ధి కల దొంగలుండడం ఒక విశేషమైతే, వారి సద్బుద్ధిని గౌరవించి వారికి శిక్షలేకుండా చేయడం మరీ విశేషం కదా!

## 16. కాశీ వెళ్లినవారంతా అన్నంభట్టు లౌతారా ?

ఒకప్పుడు 'అన్నంభట్టు' అనే పేరున్న ఒక విద్యార్థి ఉండేవాడు. అతనికి పెద్దగా చదువు ఒంటబట్టేది కాదు. ఏదో ఎలాగో వేదవిద్య పూర్తయిందని పించాడు. వివాహానికి తగిన వయసురాగా, తలిదండ్రులు మంచి శ్రోత్రియుని కూతురూ, సంస్కృతంలో కవిత్వం కూడా చెప్పగల పిల్లతో అతనికి పెళ్లి జరిపించారు. ఆమె తలిదండ్రులూ ఆమే కూడా వీలయినంత ఎక్కువగా సంస్కృతంలోనే మాట్లాడుకుంటూ ఉండడం, కనీసం పెళ్లిపీటలమీద కూడా సంస్కృతాన్ని విడవకపోవడం కారణంగానూ-ఆ భాష తనకంతగా రాని కారణంగానూ-'కొంత అర్థమయ్యీ, కొంత కాకా' అన్నంభట్టుకి పెద్దతలనొప్పిగా అన్పించింది వారి ధోరణి. అయినా 'ఏం చేస్తాం?' అనుకున్నాడు అన్నంభట్టు అప్పటికి.

మూడు నిద్రలకి అత్తవారింటికి వెళ్లాడు అన్నంభట్టు. ఏమైనా ఈ మూడు రోజుల్లోనూ సంస్కృతాన్ని నేర్చేసుకోవాలనే పట్టుదల అతణ్ణి గట్టిగా పట్టింది. తనకి వేదమైతే కంఠస్థంగా వచ్చు. అయితే సంస్కృతభాష మాత్రం రాదు. అలా రాకపోవడం ఇక్కడ ఇబ్బందై కూర్చుంది. ఈ కారణంగా అత్తవారి ఊరుని చూస్తున్న వంకతో ఊరంతా తిరిగి మొత్తానికి ఒక మహావిద్వాంసుణ్ణి తనకి సంస్కృత గురువుగా ఎంచుకున్నాడు. అయితే ఆయన ఉండే చోటు, తమ నివాసానికి కొద్ది దూరం. అయితేనేం ? ఏదో ఒక అండగా ఉండి సంస్కృతాన్ని చెప్తానన్నాడుగా ! అదే పదివేలనుకుని, రోజులో ఎక్కువ సేపు ఆయన వద్దనే గడపసాగాడు.

అన్నంభట్టుకి మరీ ఇబ్బంది 'భోజనాల వేళ' లోనే. అన్నమ్-భక్ష్యమ్- చోష్యమ్ (పులుసు) - సూపః(పప్పు) - శాకమ్ (కూర) - దధి(పెరుగు) - తక్రమ్ (మజ్జిగ) వంటి పదాలని మొదట రోజునే నేర్చుకుని, వాటిని బాగా గుర్తుంచుకుని రెండోరోజు భోజనాల వేళలో 'అన్న మానీయతామ్ (అన్నం పట్రండి) చోష్యం దీయతామ్ '(పులుసు పొయ్యండి) ... అంటూ ముక్తసరిగా వాక్యాలని మాట్లాడ్డం మొదలెట్టాడు.

ఆ వాక్యాలని మాట్లాడుతున్న తీరుని బట్టి, తన భర్తకి సంస్కృతం వచ్చి మాట్లాడుతున్నాడా ? లేక ఏవో కొన్ని వాక్యాలని మాత్రం ముక్కున పట్టుకుని చిలకపలుకుల్లా ఈ సమయంలో అప్పగిస్తున్నాడా ? అనే విషయం, సంస్కృత పండితురాలు కావడం మూలాన ఆమెకు ఇట్టే అర్థమైపోయింది. తమ ఇంటికొచ్చాక సంస్కృతంతో ఇబ్బంది పడలేక, తన భర్త మెల్లగా సంస్కృతం నేర్చుకోవాలనే ఆసక్తితో ఉన్నాడనే విషయం గ్రహించిన ఆమె వెటకారంగా కాక, సన్నని పరిహాసం చేస్తూ 'ముసలః కిసలాయతే' అంది.

అంతే ! భోజనం చేసినంతసేపూ 'ముసలః కిసలాయతే' అనే ఆ వాక్యాన్నే అనుకుంటూ తొందరగా భోజనాన్ని ముగించిన అన్నంభట్టు ఆ విద్వాంసుని వద్దకి వెళ్లి చెప్పాడు. ఆయన నవ్వుతూ 'రోకలి చిగురుస్తోంది' అని దీని అర్థం అని చెప్పాడు.

అన్నంభట్టుకి తన భార్య చేసిన వేళాకోళం చాల మనస్తాపాన్ని కల్గించింది. ఎప్పటికైనా తన భార్య, మామలకంటె మించిన పాండిత్యాన్ని పొంది ఆ మీదటే తన మొహాన్ని వాళ్లకి చూపించాలని నిశ్చయించుకున్నాడు. ఎక్కడికి

వెళ్లిందీ, ఎందుకు వెళ్లిందీ కూడ ఎవరికీ తెలియనీయరాదని భావించి మఱునాడే కాశీకి ఒంటరిగా రహస్యంగా వెళ్లిపోయాడు.

మహావిద్వాంసులైన కాశీ పండితుల సన్నిధిలో పదిహేను సంవత్సరాల పాటు నాలుగు శాస్త్రాలని అభ్యసించాడు. ఆ నాల్గింటిలోనూ కూడా ఆయనకి తర్కశాస్త్రం మఱింత నచ్చింది. దానితో తర్కంలో మహాపండితుడనే ఖ్యాతిని కాశీలోనే ఆర్జించాడు. తనమీద తనకి నమ్మకం కుదిరాక తన భార్య ఉన్న గ్రామానికి వచ్చాడు. అప్పుడు కూడా తానెవరో ఎవరికీ చెప్పలేదు.

పదిహేను సంవత్సరాల క్రితానికీ ఇప్పటికీ రూపంలో రంగులో వయసులో మాట పట్టుబడిలో మార్పుండటమే కాక పాండిత్యంతో నిండిన ఈ పండితుణ్ణి చూసి 'ఆ అన్నంభట్టే ఇత'డని ఎవరూ కనీసం ఊహించలేక పోయారు.

తర్కంలో గట్టిపండితులు శాస్త్రవాదానికి వచ్చారనీ గెలవదలచిన వారు వచ్చి వాదించవచ్చుననీ ఊరంతా చాటింపు వేసారు. అందఱి పండితుల మధ్యా తన మామగారూ, ఆ ప్రక్కనే తన భార్యా కన్పించారు. వాళ్లకి ఏమాత్రం చెప్పకుండా వెళ్లాననే బాధ అన్నంభట్టుకి క్షణ కాలం కల్గినా, ఏమాత్రం పైకి పొక్కకుండా శాస్త్రవాదాన్ని ప్రారంభించాడు.

'కాశీకి వెళ్లినవాడూ కాటికి వెళ్లిన వాడూ ఒకటే' ఆ కాలంలో. అందుకని అన్నంభట్టు ఎక్కడ చదువుతున్నదీ కూడా తెలియని గ్రామస్థులూ పండితులూ, చివరికి భార్యా కూడా ఏమాత్రపు అనుమానాన్నీ వ్యక్తీకరించలేదు.

శాస్త్రవాదంలో పండితులూ, మామా, భార్యా కూడా మొదటి పదిక్షణాలలోనే ఓడిపోయి తల దించుకుని 'తమ గురువెవరో సెలవీయవలసిం'దన్నారు అన్నంభట్టుని. వెంటనే అన్నంభట్టు తానున్న పండిత వేదికని దిగి క్రిందికి వచ్చి భార్యకి దగ్గఱగా నిలబడి 'గురు ర్భార్యా విపశ్చితి' ( నా ఈ పాండిత్యానికి గురువు నా భార్యయే) అన్నాడు.

ఆమె ముఖంలో ఆనంద బాష్పాలు గోచరించాయి. భర్తకి సాష్టాంగ ప్రణామం చేసి తన తప్పుని మన్నించ వలసిందని వేడింది. దానికి అన్నంభట్టు 'ప్రియురాలా ! ఆ రోజు ఆ మాటే అనకపోతే ఈ చదువు నాకు వచ్చి ఉండేదే కాదు. చదువు లేనప్పుడు ఎవరైనా అన్నమాట రోషాన్ని కల్గించి ఆ వ్యక్తిని చదువుకునేలా చేస్తుందని ఎవరో చెప్పగా విన్నాను. అప్పుడు ఆ వాక్యానికి అర్థం తెలియలేదు కాని, ఈ రోజు ఆ విషయాన్ని అనుభవంలో కన్నాను. చదువురాని

కాలంలో ఎవరైనా కించపరిస్తే దాన్ని సరైన తీరులో అర్థం చేసుకుంటే ఇంత లాభం ఉంటుందని గమనించేలా చేసినందుకు కృతజ్ఞుణ్ణి!' అంటూ ఆమెని తీసుకుని తమ యింటికి వెళ్లాడు అన్నంభట్టు.

'చదువు రాని విద్యార్థిని గురువు మందలించడమనేది ఆ శిష్యుని బాగుని కోరి మాత్రమే' అనే సత్యాన్ని గుర్తించిన రోజున గురుశిష్యుల మధ్య ఏ విద్యాలయంలోనూ కలతలే ఉండవు. అలాగే చదువు సరిగా రాకపోతే అన్నంభట్టులా ప్రయత్నించి సాధించాలనే విషయాన్ని ఇలాటి కథల ద్వారా గమనించి, ఆచరించిన రోజున పరీక్షా ఫలితాలు వెలువడిన పిమ్మట ఆత్మహత్యలూ ఉండవు. కార్యసాధనకి పట్టుదలేఅత్యవసరం.

అందుకే ఒక నానుడి ఉంది. 'కాశీ గమన మాత్రేణ నా న్నంభట్టాయతే ద్విజః' (ఊరికే కాశీ వెళ్లొచ్చినంత మాత్రాన అందఱూ అన్నంభట్టులైపోతారా ? కారు!) అని.

## 17. మహాపండితుల చదువు 'మొదట్లో చట్టుబండలే'.

సంస్కృతమహాకవి కాలిదాసుని చూచినా, సూర్యశతకాన్ని రాసిన మయూర మహాకవిని చూచినా, సంస్కృత భాషకంటూ ఎన్నో వ్యాకరణాలుండగా తనదంటూ ఒక ప్రత్యేక శైలిలో వ్యాకరణాన్ని నేటికీ ఏ నాటికీ కూడా చిరస్థాయిగా నిలిచేలా వ్రాసిన 'పాణిని'ని చూసినా మహాపండితుల చదువులు మొదట్లో 'చట్టుబండలు' (శిష్యులు ఆనాటి కాలంలో చదువుకోడానికి కూచునే నాపరాళ్లు) గానే ఉందనిపిస్తుంది.

అయితే ఏదో ఒక రోజున అద్భుతమైన స్ఫూర్తి వారికి కలిగి వారి జీవితాలు మలుపు తిరిగి ఎవరూ ఎక్కలేనంత ఎత్తుకి వెళ్లిపోయారు. ఇదంతా ఎందుకంటే, చదువు మొదట్లో రానంత మాత్రాన 'శాశ్వతంగా ఇక చదువే వీనికి రా'దని భయపడకుండానూ-పట్టుదలతో చదువు వస్తుందనే విషయాన్ని అలాటి విద్యార్థికి చెప్పి సరైన త్రోవలో పెట్టేందుకున్నూ.

ఒక ఆశ్రమంలోని విద్యార్థులలో 'పాణిని' అనే విద్యార్థి ఉంటూండేవాడు. ఎందఱెందఱోవిద్యార్థులు తనతో పాటు చేరిన వాళ్లందరికీ చదువు ముగిసి వెళ్లిపోతున్నా పాణినికి చదువు ఏ మాత్రమూ ఒంటపడుతూండేది

కాదు. దానితో అతని తలిదండ్రులు చాల దిగులుపడసాగారు. పాణినికి మాత్రం ఏమీ అన్పించేది కానేకాదు. గురువుకి మాత్రం ఇతడికి ఎందుకు చదువబ్బడంలేదో ఒక పట్టాన తేలేది కాదు.

ఒకనాటి సాయంత్రం గురువుగారితో కలిసి పాణిని ఊరి వెలుపలకి వెళ్లాడు. ఏవో మాట్లాడుకుంటూ వస్తూన్న ఆ సమయంలో అక్కడ ఎందరో స్త్రీలు నీలాటిరేవు నుండి నీళ్లని కడవలతో ముంచుకుని తీసుకుని వెడుతున్నారు. గురువుకి ఏదో చక్కని ఆలోచన తట్టి 'పాణినీ ! ఆ స్త్రీలు నీళ్లు పట్టుకు వెడుతున్న విధానాన్ని గమనించు' అన్నారు.

పాణిని శ్రద్ధగా చూడసాగాడు. ప్రతిస్త్రీ నీళ్లలోనికి దిగుతూ వస్త్రం తడవకుండా కొద్దిగా పైకి కుచ్చెళ్ల బట్టని బొడ్లో దోపుకుని, చంకలో ఉన్న మట్టి కుండతో నీటిని ముంచుకుని, ఆనీటి కడవని, దగ్గఱగా ఉన్న ఒక ఱాతిమీద పెట్టుకుని, ఱాతిపక్కగా నిలబడ్డ ఒక స్త్రీ సహాయం చేస్తూంటే భుజానికి ఎత్తుకుని మళ్లీ యథాప్రకారం బట్టని క్రిందికి అనుకుని వెళ్లిపోతున్నారు. పాణిని చాలసేపు ఆ దృశ్యాన్ని అలాగే గమనిస్తూ ఉండిపోయాడు. ఆ విషయాన్ని గురువు బాగా గమనించాడు.

కాసేపటికి పాణినితో 'పాణినీ ! ఱాయి ఏమాత్రం తగిలినా ముక్కలయ్యేది కుండగదా ! కాని అక్కడ చూసావా ? స్త్రీలు తమ కుండని నీళ్లలో ముంచాక ఆ బరువు కుండని ఆ ఱాతిమీద పెడుతూంటే, ఎంతో కాలంగా కుండలని పెడుతూ ఉన్న కారణంగా కఠినమైనదీ ప్రాణం లేనిదీ అయిన ఱాయి కూడా అరిగి సొట్టపడి కన్పిస్తోందే ! మరి సున్నితంగా ఉండేవాడివీ ప్రాణం ఉన్నవాడివీ అయిన నీకు ఎందుకని బుద్ధిమాంద్యంలో అరుగుదల కన్పించడం లేదు?' అన్నాడు.

నడవని గుఱ్ఱాన్ని చెర్నాకోలతో కొడితే ఎలా ఉంటుందో అలా అన్పించింది పాణినికి. ఆ ముహూర్తమే పాణిని జీవితంలో అదృష్ట భవనాలకి గృహ ప్రవేశముహూర్తం అయింది. అంతే! అప్పటినుండి చదవడం ఆరంభించి చెప్పలేనంత సూక్ష్మబుద్ధి కలవాడయ్యాడు. ఇతని బుద్ధి విశేషాన్ని గమనించిన గురువు మంత్రోపదేశాన్ని కూడ చేసాడు. అంతే ! పాణిని శంకరుణ్ణి గూర్చి తపస్సు చేసాడు.

**'నృ త్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచ వారమ్ ।**
**ఉద్ధర్తుకామాన్ సనకాది సిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్॥'**

శంకరుడు తననృత్యం అయిపోయిన పిమ్మట తన డమరుకంతో 14 మార్లు నాదాన్ని చేసాడు. సనకాది సిద్ధులంతా ఆ నాదాలని విన్నారు. ఆ 14 చప్పుళ్లు ఇవి.

1) అ ఇ ఉ ణ్ 2) ఋ ఌ క్ 3) ఏ ఓ ఙ్ 4) ఐ ఔ చ్ 5) హ య వ రట్ 6) ల ణ్ 7) ఞ మ ఙ ణ న మ్ 8) ఝ భ ఞ్ 9) ఘఢధశ్ 10) జ బ గ డ ద శ్ 11) ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ 12) క ప య్ 13) శ ష స ర్ 14) హల్.

ఈ ధ్వనులు సరిగ్గా డమరుక నాదాల్లానే ఉంటాయి గమనించ వచ్చు. ఈ నాదాలని ఆధారం చేసుకునే సంస్కృతభాష మొత్తానికి పాణిని మహర్షి 'వైయాకరణ సిద్ధాంత కౌముది' అనే వ్యాకరణ గ్రంథాన్ని రచించాడు. సంస్కృత వ్యాకరణంమొత్తం ఈ 14 సూత్రాలనుండే పుట్టిందంటే చాల ఆశ్చర్యమని పించవచ్చు గాని అది నిజం.

ఎప్పుడైనా మహర్షులైన గురువులంతా ఒకచోట సమావేశమైనప్పుడు తమలో తాము తమ విద్యార్థుల తెలివితేటలని గూర్చి ముచ్చటించుకొనే సందర్భంవస్తే అందఱూ ఒక్కటే అనేవారట 'త త్రైక: పాణిని ర్నామ జడబుద్ధి తరో**z** భవత్' 'అబ్బో! ఫలాని ఆశ్రమంలో మహామందబుద్ధి ఒకడున్నాడు. వాటి పేరు పాణిని. అంతకుమించిన జడుడు ఇంకొకడు లేడు' అని.

అలాటి పాణిని 'వైయాకరణ సిద్ధాంత కౌముదీ' అనే మహా వ్యాకరణాన్ని వ్రాస్తే దానికి కాత్యాయని వార్తిక రూపంగా వ్యాఖ్యానాన్నీ, పతంజలి మహర్షి భాష్యాన్నీ వ్రాసాడు. ఆ పతంజలి వ్రాసిన వ్యాఖ్యానాన్నే 'మహాభాష్యం' అన్నారు. అందుకని ఎవరైనా చిన్నవయసులో కొంత మందబుద్ధిగా ఉన్నంత మాత్రాన మనం నిరుత్సాహపడకూడదు. విశేషించి అతణ్ణి నిరుత్సాహపఱచకూడదు గూడ.

## 18. డబ్బుకోసం పిల్లలు తల్లిని చంపారా?

'ధనమూల మిదం జగత్' ఈ ప్రపంచమంతా డబ్బుతోనే నడుస్తోందనే వాక్యం నిజమే కాని, డబ్బు ఎంతటివారిమధ్యనైనా కలహాన్ని తెచ్చిపెడుతుంది. కౌరవ పాండవుల మధ్య కలహం వచ్చి పద్దెనిమిది అక్షౌహిణుల

సైన్యం ధ్వంసమైందంటే కారణం, తమది కాని సంపదని తాము చేజిక్కించుకోవాలని కౌరవులు ఆశించడమే కదా !

**విత్తానా మార్జనే దుఃఖమ్ ఆర్జితానాం చ రక్షణే ।**
**రక్షితానాం విభాగే చ దుఃఖం విత్తస్య లక్షణమ్ ॥**

ధనాన్ని సంపాదించడం చాలా కష్టం. సంపాదించిన ధనాన్ని వ్యర్థంగా వ్యయమై పోకుండా, దొంగల పాలు కాకుండా, రక్షించుకోవడం అంతకంటె కష్టం. ఇలా సంపాదించిన దాన్ని మఱింతగా రక్షించి పెంచి పెద్ద చేసిన ధనాన్ని పిల్లలకి విభజించిఇవ్వమనేది ఎంతెంతో కష్టమట. అలా పంపకాల్లో ఒకచోట విరోధాలు వచ్చాయి ఒక ఇంట్లో.

ఒక తల్లికి ముగ్గురు పిల్లలున్నారు. ఇంట్లో ఎవరికైనా కడగొట్టు సంతానం (చివరగా పుట్టినవారు) అనగానే సహజంగా కొంత ఇష్టం ఎక్కువగా ఉంటుంది. అదీ కాక ఆ యింట్లో చివరి వానికి దివాణంలో గాని మఱెక్కడా గాని ఎంత ప్రయత్నించినా ఉద్యోగం రాలేదు. చదువు కూడ అంతంత మాత్రంగానే వానికి ఒంటబట్టింది. ఆ కారణంగా ఆ తల్లి ఆస్తిని పంచేప్పుడు చిన్నవానికి కొద్ది ఎక్కువగా ముట్ట చెప్పింది. దానితో మిగిలిన ఇద్దఱు అన్నదమ్ములతో వీనికి విరోధం కల్గింది.

'వాడికి ఉద్యోగం లేదు. చదువూ రాదు. మీకు రెండూ ఉన్నాయి కదా ! నాకు ముగ్గురూ సమానమే కాబట్టి ఇలా చేసా' నని ఎన్నిమార్లు తల్లి చెప్పినా ఆ ఇద్దఱూ వినలేదు. పైగా తల్లిని చంపి ఆ ఆస్తిని కాజేయాలనే దురాలోచనకి క్రమంగా వచ్చేసారు కూడా. ఇదే అదనుగా భావించి 'వాళ్లూ- వీళ్లూ' వచ్చి కొన్ని కొన్ని మాటలని చెప్పసాగారు.

కొంత కాలమైంది. ఒకరోజున పెద్దపిల్లవాడొక్కడూ పొలం దున్నుతూంటే రెండోవాడు వాడికి సహాయానికి వెళ్లాడు. ఇటు ఉద్యోగపు రాబడితో పాటు అటు సొంత వ్యవసాయపు రాబడి కూడా ఉన్న ఈ ఇద్దఱి అభివృద్ధీ తల్లికి కూడా బాధ అన్పించింది. ఆ పొలాన్ని తమ ఉద్యోగపు రాబడితో ఆ ఇద్దఱూ కొనుక్కున్నారు.

ఆ రోజున తల్లి యిద్దఱు పిల్లలకీ ఎంతో ఆప్యాయతతో అన్నాన్ని పట్టుకెళ్లింది. ఆ ఇద్దఱూ పొలానికి వస్తూన్న తమ తల్లిని చూసారు. కోపం కట్టలు తెంచుకుంది. వెంటనే నాగలి నుండి కఱ్ఱుని లాగి దానితో ఆమె తలమీద ఒకరి

తరవాత ఒకరు పొడిచి చంపారు. 'జన్మలో ఏ తల్లీ ఆస్తిని సమానంగా కాక వేఱు విధంగా పంచకూడద'ని ఈ సంఘటన వలన తెలుసుకోవలసిందిగా అటుస్తూ చంపేసారు.

ఆ మీదట తల్లి తెచ్చిన అన్నాన్ని సుఖంగా తిన్నారు. క్షణాలలో మరణించారు. ఆమె అంతకుముందే ఆ అన్నంలో విషాన్ని కలుపుకుని వచ్చిందని వారికి తెలియదు గదా ! అక్కడి శ్లోకం వినండి.

**హ లాగ్రేణ హతా మాతా వి షాన్నేన హత స్సుత ॥**
**మాతాపితృ విరోధాయ హిరణ్యాయ నమో నమః॥**

నాగటి కఱ్ఱు కారణంగా తల్లి చస్తే, విషాన్నం కారణంగా పిల్లవాడు మరణించాడు. ఇలా తలిదండ్రులకీ అన్నదమ్ములకీ అప్పచెల్లెళ్లకీ మధ్య విరోధాన్ని కొని తెచ్చి పెట్టే 'ఓ డబ్బూ ! నీకో నమస్కారం!' అని దీని అర్థం. 'మమ్మల్ని సత్క్రమమైన బుద్ధిలో పెట్టు' అని ప్రార్థించడం కూడ ఈ కథ లక్ష్యం.

ఈ ధనం ఇలా వ్యక్తులని చంపడానిక్కారణం ఇది 'అలక్ష్మి' కాబట్టి. సరియైన తీరులో ధర్మబద్ధంగా రాని ధనం 'అలక్ష్మి' ఔతుంది. అందుకే శ్రీసూక్తంలో 'అలక్ష్మీ ర్మే నశ్యతామ్' ఏ విధమైన అధర్మార్జిత ద్రవ్యం నా వద్ద - తెలిసి లేదా తెలియక - ఉన్నా అది నశించిపోవుగాక అనే అర్థం వచ్చే మంత్రం చదువుతారు లక్ష్మీ పూజలో. ఇక 'లక్ష్మి' ఎలా ఉంటుందో చూద్దాం.

## 19. లక్ష్మీ ర్మే భజతు !
## (సంపద నాకు లభించుగాక !)

ఒకసారి ఆదిశంకరులవారు భిక్షాపాత్ర చేతబట్టుకుని వీథుల వెంట తిరుగుతూ తిరుగుతూ ఒక యింటి ముందాగి 'భిక్షాందేహి !' అని అడిగారు.

ఇంటి వాకిలికి వచ్చింది - సాక్షాత్తూ శంకరాచార్యులవారు.

తెచ్చింది - సాక్షాత్తు భగవంతుడైన శంకరుని చేతిలోని పాత్రతో సమానమైన శక్తిగల భిక్షాపాత్ర.

ఆ ఇంటి ఇల్లాలు ఇల్లంతా కలయ జూచింది. నట్టింట ఏమున్నాయో ఆమెకు తెలియదు గనుకనా? స్వామివారు వచ్చారు కాబట్టీ-అంతటివారు తమ యింటి ముందు ఆగిన కారణంగా ఏమైనా లభించకపోతుందా ? అనేది తన

ఊహ కాబట్టీ-ఇల్లంతా వెదికి వెదికి సిగ్గుతో చితికిపోయి తమ యింట భిక్షం పెట్టడానిక్కాడ ఏమీ లేదనే మాటని, దివ్యపురుషునిలా వెలిగి పోతున్న పరమాత్మ స్వరూపుడైన శంకరా చార్యులవారితో చెప్పలేక గబగబా దొడ్డివైపుకి వెళ్లింది. అదే సమయానికి తన అదృష్టం కొద్దీ ఉసిరిక చెట్టునుండి ఒక ఉసిరికాయ నేలన పడింది.

ఆమె ఆనందానికి హద్దు లేకపోయింది! 'కనీసం ఏదో సమర్పించుకోగలిగాను గదా !' అని వెంటనే పరుగు పరుగున వచ్చి ఆయన జోలిలో వేస్తూ 'మహేశ్వ రార్పణమస్తు' అంది.

చాల సేపటినుండి ఆమెనీ, ఆమె దారిద్ర్య కారణంగా కళ్లలో కన్పిస్తున్న దీన భావాన్నీ గమనిస్తూన్న శంకరాచార్యుల వారు మిక్కిలి జాలిపడి వెంటనే లక్ష్మీదేవిని ప్రార్థిస్తూ అక్కడి కక్కడ ఆశువుగా 'కనకధారా స్తోత్రమ్' అనే పేరిట లక్ష్మీదేవిని స్తుతించే శ్లోకాలని చెప్పేసారు. ఇప్పటికీ ధనం కావాలనిపిస్తే ఈ స్తోత్రాన్ని చదవడం సంప్రదాయంలో ఉంది.

ఈ స్తోత్రంలో అతిముఖ్యమైన శ్లోకంగా దీన్ని చెప్తారు.

**దద్యా ద్ద యానుపవనో ద్రవి ణాంబుధారామ్**
**అస్మి న్నకించన విహంగ శిశౌ విషణ్ణే ।**
**దుష్కర్మ ఘర్మ మపనీయ చిరాయ దూరం**
**నారాయణ ప్రణయినీ నయనాంబువాహ ః॥**

"ఓ పరమేశ్వరుడా ! 'ధనం' అనే మేఘాల సమూహానికి-నీ 'దయ' అనే వాయువుని వీచవలసినంత అనుకూలతతో వీచి-'లక్ష్మీకటాక్ష' మనే వర్షాన్ని కురిపించి-'పేదతన' మనే వేసవి ఎండకి తట్టుకోలేక అవస్థపడుతున్న ఈ 'స్త్రీ' అనే పక్షిపిల్లని రక్షించి-పుణ్యం కట్టుకోవయ్యా!" అని దీని అర్థం.

అంతే ! ఆమె ఇంటినిండా బంగారు ఉసిరికాయల వర్షం ప్రారంభమయింది. ఆమెకి ఎంత ఈయాలని స్వామికి అన్పించిందో అంత వర్షం కురిసేంత వరకూ ఆయన అక్కడే నిలబడి ఆ మీదట అడుగు కదిల్చారు.

వర్షం ఆగిపోయింది. తనకారణంగా ఇంత ధనవర్షం ఆమె యింట కురిసింది గదా ! అనే అతిశయం ఆయనలో లేదు. అంత ధనం ఆమెకి లభించింది కాబట్టి (దానిలో) 'తనకి ఎంత?' అనే ఊహకూడా కలలో వారికి లేనేలేదు. ఆ స్త్రీ పరమ కృతజ్ఞతతో సాష్టాంగపడి ఆనంద బాష్పాలని విడిచింది.

పరమైశ్వర్యాన్ని సంపాదించ గలిగిన శక్తి ఉండి కూడా, ఆర్థికమైన కష్టాలలో ఎవరుంటే వారికి ఆ కష్టాన్ని తీర్చాలని భావిస్తూ ఎవరు 'తమని గూర్చి తాము ఆర్థికంగా అసలు ఆలోచించనే ఆలోచించరో' వారు నిజమైన సంన్యాసులని ఈ ఇతివృత్తం చెప్తుంది. అంత ధనాన్ని ఇతరులకి ఇప్పించగలిగి ఉండి కూడా, జోలె పట్టినవారు కాబట్టే ఆదిశంకరులు నిజమైన సంన్యాసులన్నమాట.

## 20. అంతటి ఆదిశంకరుల కష్టాన్నే గట్టెక్కించిన స్తోత్రం

ఏదో కష్టం వచ్చిపడిందని ఎవరైనా అనగానే కాస్తో కూస్తో భక్తి ఉన్నవారు 'ఈ స్తోత్రం చదువుకోండి!' అంటూ ఒక సూచన చేయడం కద్దు. వెంటనే అవతలి వారు 'అది పనిచేస్తుందంటారా ? ' అనడమూ సహజమే. 'శ్రీ మత్పయోనిధి నికేతన...' అని ప్రారంభమయ్యే ఒక స్తోత్రం 'లక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రం.' ఈ స్తోత్రం వెనుక ఉన్న సజీవ కథ ఇటీవలికాలంలో జరిగిన కారణంగా 'తడియారని పాదముద్ర' వంటిదనుకోవచ్చు.

ఆదిశంకరుల వారు అద్వైతమతాన్ని స్థాపించాలనే ఉద్దేశ్యంతో ఏ వాహనమూ మార్గమూ లేని ఆరోజుల్లో రాత్రనకా పగలనగా కాలినడకనే ప్రయాణిస్తూ ఆసేతు శీతాచలమూ పర్యటిస్తూ ఎక్కడికక్కడ పండితులని వాదనలో ఓడిస్తూ వెడుతున్నారు.

త్రోవలో మాహిష్మతీ నగరం వచ్చింది. అక్కడ మండనమిశ్రుడనే మహా పండితుడున్నాడనీ అతణ్ణి జయించడం సామాన్యమైన విషయం కాదనీ, అతణ్ణి గెలిచినా అతనిభార్య ఉభయభారతిని జయించడం అసాధ్యమనీ త్రోవలో 'కుమారిలభట్టు' అనే పండితుడు ఆదిశంకరులవారికి ముందుగా చెప్పాడు.

స్వయంగా శంకరులవారు ఆ దంపతులవద్దకి వెళ్ళి, వాదానికే వచ్చానని ప్రకటించారు. ఆమె కూడ వాదానికి చాల సంతోషించి వాదంలో ఓడిపోతే ఏం చేయాలో ఆనియమాన్ని కూడా ముందుగానే ప్రకటించవలసిందిగా కోరింది.

శంకరుల వారు తడుము కోకుండా 'తల్లీ ! దురదృష్టవశాత్తూ వాదంలో నేనే ఓడితే ఓడిన క్షణం నుండి కాషాయాన్ని విసర్జించితెల్లని బట్టలు గట్టి గృహస్థునైపోతాను' అనగానే మండనమిశ్రుడు 'స్వామీ! నేనే ఓడినట్లైతే నా తెల్లని బట్టలని శాశ్వతంగా విడిచి కాషాయాన్ని కట్టి సంన్యసిస్తాను' అన్నాడు. ఆ చుట్టూ చేరిన ప్రజలు వీరు చేసుకున్న ప్రతిజ్ఞలని ఆశ్చర్యంతో విన్నారు.

మఱునాడే వాదప్రారంభమని ఇద్దఱూ నిర్ణయించుకున్నారు. ఏంజరుగుతుందో, ఎలా జరుగుతుందోనని సభాభవనం మొత్తం ప్రేక్షకులతో క్రిక్కిరిసి పోయింది. శంకరులవారూ మండనమిశ్రులూ ఎదురుబదురుగా కూచోగా వారిద్దరికీ మధ్యగా కొద్ది దూరంలో ఎత్తైన ఆసనం మీద మండనమిశ్రుని భార్య 'ఉభయభారతి' తీర్పరిగా కూచుంది. ఆమె ఇద్దఱికీ చెరొక పూలమాలనీ ఇచ్చి మెడలో వేసుకోవలసిందని సూచిస్తూ 'ఎవరి మెడలో పూమాలవాడితే వారు ఓడినట్లే' అని చెప్పింది. ఆ పూలమాలలు మామూలు పూలతో గుచ్చబడినవి కానేకావు. తపశ్శక్తితో గుచ్చబడి స్వయంగా దేవలోకం నుండి వచ్చినవని ఆ ముగ్గురికి మాత్రమే తెలుసు.

రెండు మదగజాల మధ్యా, బలిష్ఠులైన ఇద్దరు మల్లయోధుల మధ్యా , కోపించిన రెండు కంఠీరవాల మధ్యా యుద్ధం ఎలా ఉంటుందో ఈ ఇరువురి వాదోపవాదమూ అలా సాగింది. క్రమక్రమంగా మండనమిశ్రుల మెడలోని పూమాల వాడడం ప్రారంభించి పూర్తిగా వాడిపోయి అతని ఓటమిని తెల్పగానే శంకరుల వారు మౌనంగా ఉండిపోయారు.

ఆ దశలో ఉభయభారతి తన వేదికనుండి దిగి 'శంకరాచార్యా! శోణనదీ తీరంలో కర్మిష్ఠి అయిన విష్ణుమిత్రుడనే విప్రుని పుత్రికని నేను. మాయింటికి ఒక మహాయోగి రాగా ఆయనని నా తండ్రి నా భవిష్యత్తుని అడిగాడు. సాక్షాత్తూ బ్రహ్మయే మండన మిశ్రుడనే పండితునిగా పుట్టి ఈమెని వివాహమాడగలడని ఆరోజున ఆయన చెప్పాడు. కాబట్టి ఈయన ఓడడమనేది అంత సులభమైన అంశం కాదు. కాని మీరు ఓడించారంటే బ్రహ్మకి మించిన వారు మీర య్యుంటారు.

అందుకని నాదొక చిన్న మనవి. భార్య ఎప్పుడూ భర్తలో సగదేహం. మీరిప్పుడు అర్ధం మాత్రమే విజయాన్ని సాధించారు. నాతో కూడ వాదించి గెలుపునందితే తప్పక నా ఓటమి నంగీకరిస్తాను. ఇలా పలకడం అసందర్భం అనుచితం కాబోదు. ఒకప్పుడు ఇలాటి వాదమే జరిగినప్పుడు యాజ్ఞవల్క్యుడు గార్గితోనూ, జనకుడు సులభతోనూ వాదించారు' అనగానే శంకరులవారు అంగీకారాన్ని తెల్పారు. శంకరుని కెదురు స్థానంలో ఆమె కూచుని వాదం ప్రారంభించి కామ శాస్త్రంలోని ఒక ప్రశ్నని శంకరుని మీదికి గుప్పించింది. 'నాటి అందఱు సంన్యాసులూ యథార్థసంన్యాసులు కాబట్టి, ఆ నాటి సంన్యాసులకి'

కామశాస్త్రపు వాసన ఏమాత్రమూ ఉండేది కాదు. దానితో శంకరులవారు ఆమెని ఒక మాసం గడువునీయవలసిందిగా కోరారు. ఆమె కూడ అందుకు అంగీకరించింది.

శంకరులవారు కామశాస్త్రాన్ని ఎలా అభ్యసించాలా ? అనే ఆలోచనలో పడ్డారు. విషయం తెలియాలంటే అనుభవం కూడ ఉండాలి గదా ! కామశాస్త్రంలో అనుభవాన్ని పొంద ప్రయత్నించడమనే మాట అటుంచి అలాటి అనుభవాన్నిగురించి ఆలోచించడం కూడ సంన్యాసదీక్షకి విరుద్ధమైనదే. ఎలాగా ? అని ఆలోచిస్తూ ఉన్నవేళలో అమరుకుడనే మహారాజు మరణించాడనే వార్త శంకరులవారికి అందింది.

వెంటనే రాజుదేహంలో పరకాయ ప్రవేశం (ఒకరిదేహంలోనికి ప్రవేశించడం) చేయాలని సంకల్పించారు శంకరులవారు. శంకరుల వారి శిష్యుడు పద్మపాదుడు మాత్రం అది తగదన్నాడు. ఒకప్పుడు మత్స్యేంద్రమహారాజ శరీరంలోనికి ఒకయోగి పరకాయ ప్రవేశం సద్బుద్ధితోనే చేసి చివరికి స్త్రీ సాంగత్యమూ, వైభవాలూ కారణంగా పతితుడయ్యాడని ఆకథని వివరంగా చెప్పి 'వద్ద'ని సూచించాడు.

వాదంలో నెగ్గవలసి ఉన్న తాను పద్మపాదుని సూచనని హెచ్చరికగానే భావించగలనని శంకరులవారు పల్కుతూ, చూస్తూండగానే అమరుకుని దేహంలోనికి ప్రవేశిస్తూ తన దేహాన్ని ఏ జంతువూ తినివేయకుండా చాల భద్రంగా రహస్యంగా ఉంచవలసిందని పద్మపాదునికి చెప్పారు. అంతే ! అంతా చూస్తూండగానే అమరుకుడు నిద్రనుండి లేచిన వానిలా కళ్ళు తెరిచాడు. ప్రజల ఆనందానికి అంతులేకపోయింది.

రాజ్యభారాన్ని మంత్రుల మీద పెట్టేసాడు అమరుకుడు. వాత్స్యాయనుడు రాసిన కామశాస్త్రానికి చక్కని వ్యాఖ్యానాన్ని చాల శీఘ్రంగా రాయడమే కాకుండా చక్కని శృంగార గ్రంథాన్ని కూడ తనకు లోగడ ఉన్న అనుభవాలతో రాసాడు. ఈ విధంగా రాయాలనే బుద్ధిని కల్గించింది శంకరులవారేనని వేఱుగా చెప్పాలా ? ఆ శృంగార గ్రంథమే నేటికీ అమరుకకావ్యంగా నీరాజనాలందుకుంటోంది.

ఇది ఇలా ఉండగా ప్రజలందరికీ రాజు ప్రవర్తనలో అనుమానం తోచింది. రాజ్యాన్ని మంత్రులకి అప్పగించడం దగ్గఱనుండి ఆయన ప్రవర్తన చిత్రంగా ఉండడం, మరణానికి పూర్వానికీ, తిరిగి బ్రతికిన పిమ్మటి విధానానికీ

భేదం ఉండడంతో 'ఎవరో యోగిపుంగవుడు ఈతనిలో ప్రవేశించా'డని ప్రజలకి అర్థమయింది. అంతేకాదు. సకాలంలో వర్షాలు పడడం, రాజుకి దాన బుద్ధి విశేషంగా కల్గడం. నగరంలో రోగాలన్నీ ఉపశమించడం, ఎక్కడా ఉపద్రవాలు మచ్చుకైనా లేకపోవడంతో ప్రజలంతా 'ఈ రాజే శాశ్వతంగా తమని ఏలా'లని ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నారు.

తమ ఆలోచన ఫలించేందుకై, 'ఎక్కడెక్కడ దహన సంస్కారాలు లేకుండా శరీరాలున్నాయో వాటిని వెదికి వెదికి దహించివేయవలసిందిగా' రాజభటులని సర్వప్రాంతాలకీ పంపారు. అలా శరీరాలని దహించివేస్తే పరకాయ ప్రవేశం చేసిన యోగి. తిరిగి రాజశరీరం నుండి పో వీలులేక శాశ్వతంగా రాజులోనే ఉండిపోగలడనీ, తద్వారా తాము సుఖశాంతులతో ఉండవచ్చనీ ప్రజల భావన.

రాజభటులు ఎక్కడెక్కడి అనాథ ప్రేతాలనీ శీఘ్రంగా దహించి వేయడం ప్రారంభించారు. పద్మపాదుడు మాత్రం శంకరుల వారి దేహాన్ని మరింత జాగ్రత్తగా భద్రపరిచినా భయంతోనూ, నెలగడువు తీరవస్తోందనే ఆందోళనతోనూ, ఎక్కడ శంకరులవారు త్రోవ తప్పుతారోననే ఆవేదనతోనూ, రాజభటుల రాక గూర్చిన మనస్తాపంతోనూ అమరుకుని రాజాస్థానానికి గాయకుని వేషంలో వెళ్లి కొన్ని గీతాలనాలపించి 'శంకరులవారికి మాత్రమే అర్థమయ్యే తీరులో తన కంగారుని మొత్తాన్ని' నివేదించాడు.

శంకరులవారు వెనువెంటనే అవతారం చాలించదలిచి తన దేహాన్ని ఉంచిన చోటికి వచ్చి రాజదేహం విడిచి ప్రవేశింపబోయారు. కాని అప్పటికే రాజభటులు తన దేహాన్ని చితిపై పెట్టేసారు. ఇకఅగ్నిని పెట్టబోతున్నారు. తానింకా అల్లంత దూరంలో ఉన్నారు చితికి. పొరపాటున అగ్ని ఆ శరీరానికి అంటుకున్నట్లయితే ప్రవేశించేందుకు తన సంన్యాసి దేహం ఉండదు. శాశ్వతంగా రాజదేహంలో ఉండిపోయి పద్మపాదుడు చెప్పినట్లు ఈ జన్మకే అపచారం జరుగవచ్చు కూడ.

అలాటి జీవన్మరణ సమస్య ఆదిశంకరులంతటి అవతారమూర్తికే ఎదురైన సందర్భంలో గుండెనిండు దుఃఖంతో ఆదిశంకరులవారు పరుగుపరుగున వస్తూ లక్ష్మీనృసింహ స్వామిని ఆశువుగా శ్లోకాలలో ప్రార్థించసాగారు.

**శ్రీమత్పయోనిధినికేతన ! చక్రపాణే ! భోగీంద్ర భోగి మణిరాజిత పుణ్యమూర్తే !**
**యోగీశ ! శాశ్వత! శరణ్య ! భ వాబ్ధిపోత ! లక్ష్మీనృసింహ మమ దేహి క రావలంబమ్ !!**

'లక్ష్మీనృసింహ స్వామీ ! నాకుచేయూత నీయవలసిందిగా ప్రార్థిస్తున్నాను' అని ఆర్తితో అడగడమే ఈ స్తోత్ర సారాంశం. ఈ స్తోత్రంలో అతిముఖ్యమైన శ్లోకంగా

**ఏకేన చక్ర మపరేణ కరేణ శంఖ మన్యేన సింధుతనయా మవలంబ్య తిష్ఠన్।**
**వా మేతరేణ వర దాభయపద్మచిహ్నం లక్ష్మీనృసింహ ! మమ దేహి క రావలంబమ్ ॥**

అనేదాన్ని చెప్తారు.

'ఒకచేత్తో చక్రాన్నీ, వేఱొక చేత్తో శంఖాన్నీ పట్టుకుని, మఱోచేతి మోచేతి మలుపుతో లక్ష్మిని ఒడిసి పట్టుకు కూర్చుని, మఱో చేత్తో వరదహస్తాన్నీ, ఆనాల్గవ చేతితో అభయాన్నీ ప్రసాదిస్తూన్న లక్ష్మీనృసింహా ! నాకు చేయూతనీయవా ?' అని ప్రార్థిస్తూండగా రాజభటులకి చితి వెలగ లేదు. శంకరులవారు తమ దేహంలోకి ప్రవేశించారు. అమరుకుడు విగతజీవుడయ్యాడు. శంకరులవారు చితిపై నుండి లేచారు.

అనుకున్నమాట ప్రకారం ఉభయభారతితో వాదం చేసి శంకరులవారు గెలిచారు. అయినా 'తల్లీ ! ఇలా నీ పాండిత్యాన్ని రూపుకట్టిన మూర్తితో మేం నిర్మింపబోయే శంకరమఠాలన్నింటిలోనూ శారదాదేవి రూపంతో ఉండవలసిందిగా అభ్యర్థిస్తున్నా'నని శంకరులవారు ఉభయభారతితోఅన్నారు. ఆమె అంగీకరించింది. ఇప్పటికీ శంకరమఠాలలో శారదాదేవి రూపంలో కనిపించే ఆమె ఉభయభారతే అన్నమాట.

దీన్ని బట్టి లక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రపు గొప్పదనాన్ని గ్రహించవచ్చు. కష్టాన్ని దాటవచ్చు.

## 21. నాకు తెలిసిందిదే !

జగన్నాథ పండితరాయలు మన రాష్ట్రానికి సంబంధించిన తూర్పుగోదావరి జిల్లా కోనసీమ వాడని కూడ చెప్తారు. అయితే అతను ఢిల్లీ పాదుషా ఆస్థానానికి చేరడంలో ఒక చిత్రమైన గాథ ఉంది. కవిత్వమే ఆయుధంగానూ, పాండిత్యమే దాని 'వాడి అంచు' గానూ కల జగన్నాథుడు రాజులందఱినీ మెప్పిస్తూ అలా అలా ఢిల్లీ సమీప ప్రదేశంలో ఒక సత్రంలో విడిది చేసాడు ఒక రాత్రి.

తెలవారుతూండగానే తన స్నాన సంధ్యావందనాదులు ముగించుకోదలచి ఒక చెఱువు వద్దకి వచ్చాడు. అక్కడ ఇద్దఱు ఘూర్జర స్త్రీలకి

(గుజరాత దేశీయ స్త్రీలు) వాగ్వివాదం జరుగుతోంది. జగన్నాథుడు తన స్నానాన్ని తాను ముగించుకుని వచ్చేసాడు. ఆ సమయానికే వారిలో కొట్లాట కూడ ముగిసింది.

ఆ ఇద్దఱిలో ఒకామె తనకి జరిగిన అన్యాయాన్ని రాజువద్ద మొఱపెట్టుకుంది. ఆ దేశమంత్రి, మొత్తం కథనంతా విని రెండవ ఆమెకు కబురుచేసి ఆమె చెప్పింది కూడా విన్నాడు. ఆ ఇద్దఱూ చెప్పింది విన్నాక 'దీనికి సాక్ష్యం ఎవరైనా ఉన్నారా ?' అన్నాడు మంత్రి. ఆ ఇద్దఱూ కూడ 'ఎవరో ఒక బ్రాహ్మణుడు ఆ సమయానికి స్నానం చేస్తూ అక్కడే ఉన్నా'డని చెప్పారు. వెంటనే తీర్పు చెప్పవలసిన ఆచారం ఆ రాజుది. అంతే! ఆలస్యం చేయవీలులేదు కాబట్టి సత్రంలో ఉన్న విప్రుడైన జగన్నాథుని కోసం రక్షకభటులు రానే వచ్చారు. జగన్నాథునికి విషయాన్ని చెప్పి పాదుషా ముందుంచారు.

జగన్నాథుడు ఢిల్లీ పాదుషాని చూసి 'రాజా ! నాకు వారిద్దఱూ మాట్లాడుకునే భాష ఏమో తెలియదు. అయితే 'మొదటి ఆమె ఇలా అంది. రెండవ ఆమె ఇలా అంది' అంటూ ఆ విన్న విషయాన్ని వారి భాషలోనే (ఏకసంథాగ్రాహి కావడంతో) చెప్పేసాడు పాఠం అప్పజెప్పినట్టు. అంతా చెప్పి 'నాకు తెలిసిందింత మాత్రమే' అని ముగించాడు.

బ్రాహ్మణుడైన జగన్నాథుని ధ్వన్యనుకరణనీ-అర్థం తెలియకపోయినా వాక్యాలు చెడకుండా చెప్పిన ఆ తీరునీ-వింటూ ఢిల్లీ పాదుషా తీర్పు చెప్పి జగన్నాథునికి పాదాభివందనం చేసి తన ఆస్థానంలో కవిగా ఉండవలసిందని ప్రార్థించి ఉద్యోగంలో తన కోసం నియమించుకున్నాడు.

అందుకే కాలిదాస మహాకవి అంటాడు 'న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్' అని. రత్నం ఎవరినీ వెదుక్కోదట. రత్నాన్ని మనం వెదుక్కోవాలిట. అందుకని జగన్నాథుడు పాదుషాని వెదుక్కోడు. పాదుషా జగన్నాథుణ్ణి కావాలని స్వీకరించాడు. నిజమైన కవులందఱినీ రాజులే ఆహ్వానించి ఆస్థానాలలో నియమించుకున్నారు చరిత్రలో. అందుకే 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్నారు.

## 22. జగన్నాథ పండితుని చివరి పుట

సంస్కృతంలో అలంకారశాస్త్రగ్రంథాలని రాసిన ఆలంకారికులలో అగ్రగణ్యుడై, 'రసగంగాధర'మనే పేరిట అద్భుతాలంకార గ్రంథాన్ని రాసిన జగన్నాథ పండితరాయలు 'పండితులందరికీ పండితుడు'. ఆయన

'గురువులక్కూడా గురు'వనిపించుకున్నాడు. ఆయన ఢిల్లీ పాదుషా కొలువులో కవిగా ఉంటూ అలంకార శాస్త్రంలో దిట్ట అన్పించుకున్నాడు.

జగన్నాథుని కవిత్వానికి మెచ్చి ఇతరదేశరాజులు కూడా ఎన్నెన్నో బహుమతులని పంపుతూండేవారు. వాటన్నింటినీ ఆయన రాజుకే ఇచ్చి వేసేవాడు. ఒకసారి, ఎంతో ప్రతిష్ఠకి సంబంధించిన సమావేశం జరిగింది. ఆ సమావేశంలో జగన్నాథుడే, ఎవరూ చెప్పని విశేషాలని చెప్పి ఢిల్లీ పాదుషా మనసుని తనవశం చేసుకున్నాడు.

క్రమంగా వీరి సాహిత్య పరిచయం వ్యసనంగా మారింది ఢిల్లీపాదుషాకి. తనకి జగన్నాథుణ్ణి చూడకుండా ఉండలేని స్థితి వచ్చేసింది. అదే విధంగా జగన్నాథునికి కూడా రోజుకి ఒక్కసారైనా పాదుషాని పలకరించనిదే ఉండలేని బంధం ఏర్పడింది. ఇలా ఉండగా ఒకరోజున ఢిల్లీ పాదుషా 'జగన్నాథా! మన బంధం ఇలా శాశ్వతంగా ఉండాలని కోరుకుంటున్నాను. నా గుర్తుగా మీ వద్ద చిరకాలం ఉండేలా ఏదైనా కోరిక కోరుకోండి' అన్నాడు.

ఏ మాత్రమూ సందేహించకుండా జగన్నాథుడు 'ఇయం సుస్తనీ మస్తక న్యస్తహస్తా లవంగీ సదంగీ మదంగీకరోతు' 'ఇదిగో ఇక్కడే చక్కగా తిరుగుతూ తలమీద ఉండే బురఖాని అస్తమానం సరిచేసుకుంటూండే అలవాటున్న అతిరమణీయమణీ-నీ పుత్రికా-అయిన 'లవంగి' ని నాకు భార్యగా చేయవలసింది' అన్నాడు.

ఢిల్లీ పాదుషా నిశ్చేష్టుడైపోయాడు. అటూ ఇటూ ఉన్న మంత్రులంతా ఏం జరుగబోతోందోనని గజగజ వణికిపోసాగారు. ఆమె విషయంలో జగన్నాథునికి అంత ఇష్టం పెంపొందిందంటే అది ఒక్క నాటి విషయం కాదనీ, ఎప్పటినుండో ఈ వ్యవహారం సాగుతూ ఉండి ఉండాలనీ, ఆ విషయాన్ని తనదృష్టికెందుకు తీసుకురాలేదని తమని ఏవిధంగా శిక్షిస్తాడోనని అంతఃపురజనం తల్లడిల్లిపోసాగారు.

పాదుషా ముఖం ఎఱ్ఱబడిపోయింది. ఏం మాట్లాడలేకపోయాడు. జగన్నాథుడు మాత్రం తాంబూలాన్ని నోటికందిచ్చుకుంటూ పరిస్థితిని అన్నివైపులనుండీ గమనిస్తూ ఉండిపోయాడు. క్షణంలోనే పాదుషా మాట మాటాడకుండా గంభీరంగానూ మౌనంగానూ తన మందిరంలోనికి వెళ్లిపోయాడు.

ఆ రాత్రి పాదుషాకి నిద్రపట్టలేదు. 'వివాద శ్చ వివాహ శ్చ సమయో రేవ శోభతే (వివాదం కాని వివాహం కాని తగిన ఉజ్జీ ఉన్నవారికే చెల్లుతుంది)' అంటారు. శ్రోత్రియుడూ బ్రాహ్మణుడూ అయిన పండితుడు మహమ్మదీయ వనితని కావాలని వివాహానికి అడగడమా ? పోనీ సంపద గూర్చి ఆలోచిస్తే కొన్ని వేలసంవత్సరాలైనా తన ఆస్తికి సరితూగడీ బ్రాహ్మణుడు. కేవలం అతని పాండిత్యం, ఆ కారణంగా తానిచ్చిన చనువూ ఇంతపనికి గుటిచేసి ఉంటుందా? అని ఇలా ఊహాపోహలతో రాత్రంతా గడిపాడు. ఏ నిర్ణయమూ తనకి తట్టలేదు.

జగన్నాథుడు ఆలోచించ సాగాడు.

**'పూర్వదత్తా చ యా విద్యా పూర్వదత్తం చ య ద్ధనమ్ ।**
**పూర్వదత్తా చ యా నారీ త్రయః పుణ్యై శ్చ లభ్యతే ॥**

'నాకు వచ్చిన ఈ విద్యంతా పూర్వజన్మాదృష్టం కారణంగా వచ్చింది. ధనంగాని, భార్యగాని ఇదే విధంగా లభిస్తాయి. నాఅభిప్రాయాన్ని దాచకుండా చెప్పాను. నా అదృష్టాన్ని పరిశీలించుకుంటాను. ఆమె నాకు చాల ఇష్టం కదా !' అనుకుంటూ ఉండిపోయాడు.

పాదుషా తన కూతురిని అడిగాడు. ఆమె ఎటూ చెప్పలేదు.

మంత్రుల నడిగాడు. మౌనాన్ని వహించారు.

భార్య నడిగాడు. ఇష్టపడలేదు.

తాను బాగా ఆలోచించాడు. జగన్నాథుడు తనకి అల్లుడే అయినట్టైతే ఇటు తన వంశం వారు తనని చులకనగా చూస్తారు. అటు జగన్నాథుని వైపువారు అతణ్ణి కులభ్రష్టుణ్ణి చేస్తారు. ఈ రెంటినీ అనుభవించవలసిన అవసరం ఏ ఒక్కరికీ లేదు.

ఈ పెళ్లి కారణంగా ఏ ఒక్కకులం ఉద్ధరింపబడుతుందని అనిపించినా పెళ్లి చేయచ్చుగాని రెండు వంశాలకీ రెండు కుటుంబాలకీ, ఆమె తరఫు తనవారికీ, అతని తరఫు తనవారికీ ఎవరికీ కూడా అంగీకారం కానప్పుడు 'వివాహం చేయడం అసమంజసం' అని లోపల నిర్ణయించుకుని మర్నాడు జగన్నాథుణ్ణి న్యాయస్థానానికి రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

మఱునాడు న్యాయాధిపతి 'జగన్నాథులవారికి దేశబహిష్కార శిక్ష విధింపబడింది' అంటూ ప్రకటించి, 'ఏదైనా చెప్పుకోదలిస్తే పండితులవారు

ఒకరోజులోగా ధర్మాసనానికి చెప్పుకోవచ్చు' అని తన తీర్పుని ముగించాడు. పాదుషా మౌనంగానూ దుఃఖంతో నూ తీర్పుని వింటూ ఉండిపోయాడు. అయితే ఈ తీర్పుని వింటూనే జగన్నాథుడు

'విద్వత్త్వం చ నృపత్త్వం చ నై వ తుల్యం కదాచన ।
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే! ॥

'పాండిత్యమూ రాజరికమూ అనే రెండూ ఎప్పటికీ సమానం కానే కావు. రాజైన వానికి తానున్న దేశంలోనే గౌరవమూ ప్రతిష్ఠా ఉంటాయి గాని విద్వాంసుడైనవానికి ఈ దేశం, పరదేశం అనే భేదమే ఉండదు' అంటూ సభాభవనం వీడి వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం మరో ఆస్థానంలో కవిగా చేరేంతవరకూ ఆగలేదు.

తన దేశం నుండి బహిష్కరించినా జగన్నాథుణ్ణి గురించిన క్షేమ సమాచారాన్ని చారుల ద్వారా తెలుసుకుంటూనే ఉన్నాడు పాదుషా. తన కంతటి శిక్షని విధించినా పాదుషా మీద చక్కని శ్లోకాలని చదువుతూనే ఉన్నాడు జగన్నాథుడు.

ఈ కాలంలోనే ఎంతో చక్కని అలంకార గ్రంథాన్ని 'రసగంగాధర' మనే పేరిట వెలయించి లోకానికి అందించాడు జగన్నాథుడు. మనసులోని బాధ తొలగాలంటే గ్రంథరచనమనేది ఒక మంచి అవకాశమని జగన్నాథుడంటాడు. అది నిజమే కదా మతీ!

ఈ సందర్భంలో భారతంలోని శ్లోకం మనకి చక్కని సాక్ష్యంగా నిలుస్తుంది. కుంతికి అప్పటికి కోడలూ-గర్భవతీ అయిన ద్రౌపది, కుంతీదేవి ఆశీర్వచనానికి వెళ్ళి నమస్కరించింది సీమంతపువేళ. ఆ కుంతి కంట తడి పెట్టి

'భాగ్యవంతం ప్రసూయేథా మా శూరం మా చ పండితమ్ ।
శూరా శ్చ కృతవిద్యా శ్చ మమ పుత్రా వనం గతా ॥

'అమ్మాయీ ! శూరుణ్ణి గాని పండితుణ్ణి గాని లేదా శౌర్యం పాండిత్యం రెండూ ఉన్న వాణ్ణి గానీ కనకు. ఎందుకంటావా ? శూరులూ పండితులూ అయిన నా పుత్రులంతా వనాల్లోనే తిరుగుతున్నారు. మరి ఎవరిని కనాలని అంటావా ? తల్లీ ! అదృష్టవంతుణ్ణి కను' అని బోరున విలపించింది.

ఇక్కడా అంతే. మహాపండితుడై ఉండి కూడా జగన్నాథుడు విధికారణంగా దేశబహిష్కృతు డయ్యాడు గదా మతీ!

కొంత కాల మిలా సాగాక తానే ఆస్థానంలో ఉన్నాడో ఆ ఆస్థానపు రాజు తనకి సంవత్సరాంతంలో సంమానాన్ని చేసాడు. ఆ రాజు 'లోభి' అయిన కారణంగా చాల తక్కువ సంమానాన్ని చేయగా దుఃఖపడి జగన్నాథుడు ఆ రాజుతోనే

**ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా మనోరథాన్ పూరయితుం సమర్థః।**
**అన్యై ర్నృపాలైః పరిదీయమానం శాకాయ వా స్యా ల్లవణాయ వా స్యాత్ ॥**

'స్వామీ ! లోకంలోని కవుల మనసులోని అభిప్రాయాన్ని గమనించీ-వారి స్థాయిని గ్రహించీ-సంమానించగలవాళ్లు ఢిల్లీ పాదుషాగాని ఆ పరమేశ్వరుడుగాని మొత్తం ఈ ప్రపంచానికి ఇద్దరే ఇద్దఱున్నారు. ఇక ఇతరులైన రాజులు చేసిన సంమానం ఉందే అది కవుల యింటిలో 'కూరల ఖర్చు'కి గాని ఇంకా 'సంపన్ను'డైన రాజు చేసిన సంమానం కవుల యింటిలో వాడబడే 'ఉప్పు ఖర్చు'కి గాని సరిపోతుంది' అన్నాడు.

జగన్నాథ పండితుడు ఇంకా వివాహితుడు కాకపోవడమూ, మఱో రాజుగారి ఆస్థానంలో ఆయనకి 'తగిన సంమానం' లేక బాధపడుతూండడమూ, ఆయన పాండిత్యాన్ని గుర్తించే ఆస్థానం అది కాకపోవడమూ, దేశబహిష్కార శిక్షని తాను విధించినా ఢిల్లీ పాదుషా అయిన తనని తన పరోక్షంలో జగన్నాథుడు ప్రశంసించడమూ.... ప్రశంసిస్తూనే ఉండడమూ ఇవన్నీ ఆలోచించిన ఢిల్లీ పాదుషా, ఢిల్లీకి రావలసిందిగా కవికి కబురు చేసాడు. ఏమాత్రపు భేషజాన్నీ చూపకుండా జగన్నాథుడు తన పురానికి రాగానే తన కూతురైన లవంగి నిచ్చి శాస్త్రోక్తంగా వివాహం జరిపించాడు ఢిల్లీపాదుషా.

కొందఱు ఆమోదించారు.

కొందఱు ఆక్షేపించారు.

మఱికొందఱు అసూయపడ్డారు.

ఏ కొద్దిమందో జగన్నాథుని మంచితనాన్నీ, ధైర్యాన్నీ, ప్రశంసించి అభినందించారు.

కాలం గడిచింది. పాదుషా కాలం చేసాడు. జగన్నాథునికి తాను చేసిన తప్పేమిటో బోధపడింది. అన్యవర్ణ-జాతి-మత- కాంతని వివాహమాడడం ధర్మశాస్త్రం ప్రకారం దోషమనే ఆలోచనలో పడ్డాడు. అయినా భార్యావిషయంలో ఏనాడూ ప్రేమానురాగాలకి లోటు రానీయలేదు. తనకొక ఆలోచన కల్గింది.

'పుణ్యస్య ఫల మిచ్ఛంతి పుణ్యం నే చ్ఛంతి మానవా ః
న పాపఫల మిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నత ః॥

పుణ్యం చేస్తే వచ్చే ఫలితం కావాలని ప్రతివ్యక్తీ కోరుకుంటాడుగాని, పుణ్యాన్ని ఎవరూ చేయరట. పాపానికి వచ్చే ఫలితాన్ని ప్రతివ్యక్తీ వద్దని అనుకుంటాడుట గాని ఏదో సందర్భంలో పాపానికి ఒడిగడుతూ ఉండనే ఉంటాడట'. అందుకని తనదోషానికి ప్రాయశ్చిత్తంగా తనకి గంగాస్నానమే సరైందని భావించి భార్యతో చెప్పాడు. ఆమె కూడా సంతోషంగా అంగీకరించింది.

'వ ర్షార్థ మష్టౌ ప్రయతేత మాసా న్ని శార్థ మర్థం దివసే యతేత ।
వార్ధక్య హేతో ర్వయసా నవేవ పరత్ర హేతో రిహ జన్మనా చ ॥

వర్షకాలం నాలుగు నెలలపాటు రాబోతోందని తెలిసి ఆ కాలంలో ఇబ్బంది పడకుండా ఉండేందుకై వర్షాకాలంలో ఏం కావాలో వాటిని సమకూర్చుకునేందుకు మిగిలిన ఎనిమిది నెలలూ శ్రమిస్తూనే ఉన్నాం. రాత్రిపూట ఏం కావాలో వాటిని పగలే సమకూర్చుకుంటున్నాం. అలాగే వృద్ధాప్యంలో ఏ శ్రమకి గురి కావలసి వస్తుందోనని ఆ ముందు కాలంలోనే తగిన ఏర్పాట్లని చేసుకుంటున్నాం. ఇన్నీ ఇలా జాగ్రతపడుతూన్నప్పుడు పరలోకానికి సంబంధించిన జాగ్రత్తని కూడ ఇహంలోనే చేసుకోవద్దా ?' అని ఆమె కూడ భర్తకి వంత పలికి తోడుగా నిలిచింది.

జగన్నాథుడు తనకి అనుకూలురాలైన భార్య దొరికినందుకు ఎంతో ఆనందపడి, ఆమెతో ఎంతో కాలం దాంపత్యాన్ని పొందినందుకు సంతోషపడి, భార్య లవంగితో కలిసి కాశీక్షేత్రానికి వెళ్లాడు. నాటి ఆచారవ్యవహారాలకి విరుద్ధంగా తాను ప్రవర్తించి నందుకూ-ఆమెచేతకూడా అకృత్యాన్ని చేయించినందుకూ-మన్నించవలసిందిగా ప్రార్థన చేసాడు గంగాదేవిని. తానే కాక ఆమెచేత కూడా తెలిసి తెలిసి తానే అకృత్యం చేయించినందుకు మరొక్కతప్పు కూడ తనమీదేఉందని ఎన్నోమాఋ్లు బాధతో నమస్కరించాడు.

ఒక్కొక్క కాలంలో ఉండే కఠినమైన ఆచారం తర్వాతి కాలంలో మారవచ్చు. అది దోషంగా పరిగణింపబడక పోవచ్చు. ఒక్కో సందర్భంలో పూర్వం ఆచరించిన విధానం నేటి కాలానికి శిక్షాపాత్రం కావచ్చు. అంతమాత్రాన ఆ కథని నేటి దృష్టితో 'తప్పు' అనరాదు. ఆ కథని చరిత్రనుండి చెరిపి వేయనూ కూడదు.

అది ఆనాటికి సంబంధించిన ఇతివృత్తంగా గుర్తించి, యథార్థ చరిత్రలో ఏం జరిగిందో గమనిస్తున్నామనే దృక్పథాన్ని అలవలరుకోవాలి.

జగన్నాథుడు భార్యతో కలిసి గంగాస్నానాన్ని ముగించి మెట్లన్నీ ఎక్కి, భార్యతోనే నిలబడి 'గంగాలహరి' లేదా 'గంగాస్తవ' మనే పేరిట ఒక్కో శ్లోకాన్ని ఎలుగెత్తి ఆశువుగానూ, మనసునిండిన దుఃఖంతోనూ, పాడసాగాడు. అక్కడి భక్త జనమంతా చూస్తూండగానే ఒక్కోశ్లోకానికి ఒక్కొక్క మెట్టు చొప్పున గంగ పైకి రాసాగింది.

నూటయెనిమిదవ శ్లోకం రాగానే గంగమ్మ వారిద్దరినీ తనలో కలుపుకొంది. ఇప్పటికీ 'గంగాస్తవం' శాశ్వతకావ్యమై లవంగీ జగన్నాథుల అనుబంధాన్ని ప్రతి శ్లోకం లోనూ కన్పింపచేస్తూనే ఉంటుంది. ఎప్పుడైనా కాశీకివెడితే, గంగ కనిపిస్తే, ఆ గంగా తరంగాల మౌనధ్వనిలో లవంగీ జగన్నాథులని ఒక్కమాఱు స్మరించుకున్నాచాలు 'చరిత్ర మిగిలినట్లే'.

## 23. బుద్ధింతు సారథిం విద్ధి (బుద్ధియే నిజమైన సారథి)

ఒకపనిని సాధించాలంటే శరీర బలం కావలసిన మాట నిజమే అయినా శరీరబలాన్ని మించి బుద్ధి బలం కావాలి. అందుకే ఉపనిషత్తు

**"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ చ**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ ఏవ చ।"**

అంది.

శరీరం ఒక రథం లాటిదిట. ఈ శరీరమనే రథంలో మధ్యగా ఉండే 'ఆత్మ' అంటే తాను, 'రథి' రథంలో కూర్చుని ప్రయాణించేవాడుట. ఈ తాను కూర్చున్న శరీరమనే రథాన్ని తోలేవాడు 'బుద్ధి' అనే సారథికాగా అతని చేతిలోని కళ్లేలు 'మనస్సు' అంది ఉపనిషత్తు. 'ఇది నా సొంత శక్తి ద్వారా ఆర్జించా' నని చెప్పే వీలులేదు. ఈ సంవత్సరం పంట పండడానికి మన తెలివితేటలే కారణమనుకుంటే మఱు సంవత్సరం-పంట నాశనానికి కారణం కూడా మనమే కావాల్సిందే. అక్కడా ఇక్కడాకూడా సకాలంలో కురిసిన వర్షం, భూమిలో ఉన్న శక్తే నిజమైన కారణాలైతే మన 'బుద్ధి' సారథిగా పనిచేసి సరైన సమయంలో విత్తనాలని వేయడం వంటివి చేయించి పంటని పండించగలిగిందన్నమాట.

ఇదంతా ఎందుకంటే బుద్ధిబలం ఎంత గొప్పదో నిరూపించే కథని తెల్పడానికి.

ఒక దేశంలో ఒక రాజున్నాడు. ఆయనకి శిల్పశాస్త్రమంటే ఎనలేని మోజు. దేశంలో 'ఉత్తమశిల్పి' ఎవరా ? అని నిశ్చయించాలని పోటీలని నిర్వహించాడు. మొత్తం దేశాలన్నింటి నుండీ ఎందఱెందఱో వచ్చి శిల్ప పరీక్షల పోటీలో పాల్గొన్నారు. చివరికి ఇద్దఱిని ఉత్తములుగా నిర్ణయించారు. 'ఆ ఇద్దఱిలో కూడా ఉత్తముడెవరో తేలాలి' అన్నాడు రాజు. ఇద్దఱూ సమానంగా పోటీలో గెలిచారని మంత్రులు చెప్పినా, వారి శిల్పాలని చూపినా రాజు తృప్తి చెందలేదు.

తప్పేది లేక మంత్రి వారిద్దఱికీ ఒక నెల గడువునిచ్చాడు. విశాలమైన దీర్ఘ చతురస్రాకారపు గదిని ఇచ్చి ఆ గదికి ఇటువైపు ఒక గోడని ఒక శిల్పికీ, అటు వైపు గోడని మఱొక శిల్పికీ అప్పజెప్పుతూ ' ఈ రెండు గోడల మీదా మీ ఇద్దఱూ మీకు నచ్చిన శిల్పాలని చెక్కండి.

నెలరోజులు కాగానే రాజుగారు ఈ విశాలమైన గది మధ్యభాగానికి వచ్చి అటూ ఇటూ చూస్తారు. ఈ గోడా ఆగోడా కన్పడుతుంది. కుడివైపు ఎడమవైపు శిల్పాలని చూచిన మీదట ఏది ఉత్తమమో నిర్ణయించి ఆయన మీలో ఉత్తమశిల్పిని నిర్ణయించి సంమానిస్తారు.

అయితే మీరు శిల్పాన్ని చెక్కే కాలంలో, ఒకరి శిల్పం ఒకరికి కనిపించకుండా ఉండేందుకూ అలాగే ఖరీరేం చెక్కేదీ మాకు కూడా కనిపించకుండా ఉండేందుకూ, ఈ గదికి మధ్యభాగంలో రెండుగోడలకీ మధ్య అడ్డుగా ఒక పెద్ద చెక్క గోడని ఏర్పాటు చేస్తాం. అలాగే ఒకవైపే తలుపుని మీ మీ గదులకి ఏర్పాటు చేస్తాం. మీమీకు కావలసిన వస్తువులనన్నింటినీ ఇస్తాం' అన్నాడు.

ఒకే దీర్ఘచతురస్రాకారపు గది (వెడల్పు ఎక్కువ లోతు తక్కువ ఉన్నగది) రెండుగాచేయబడి ఒకవైపు శిల్పం వేరొక వైపుకి కన్పించే వీలు లేకుండా చెక్కగోడ కూడ ఏర్పాటు చేయబడింది. శిల్పులు పని ప్రారంభించారు. దేశ రాజధానిలోని,వారంతా శిల్పులని గమనిస్తూండేవారు. మొదటి శిల్పి సాయంత్రమయ్యే వేళకి ఎంతో అలసిపోయి దుస్తులన్నీ నలిగిపోయి వస్తూండేవాడు. అలాగే వెళ్లేప్పుడు కూడ ఎన్నో సామాన్లతో 'ఎంతో పని ఉం'దన్నట్లు వెళ్తూండేవాడు. ఇక రెండవ శిల్పి వెళ్లేప్పుడు ఎలా సంతోషంగా ఉండేవాడో వచ్చేప్పుడూ అలాగే వస్తూండేవాడు. మొదటివానంతటి అలసట రెండోవానికి ఉండేది కాదు. వస్తువులు

కూడ చాల చాల తక్కువగా వాడుతూండేవాడు. మొదటి నిర్ణయం ప్రకారం ఎవరెవరు ఏయే శిల్పాన్ని చెక్కుతున్నారో అది వారిద్దటిలో వారికే తెలుసు. అదికూడా ఒకరిది ఒకరికి తెలియదు. ఇక ప్రజలకి ఏమాత్రమూ తెలియదు.

నెలరోజులయింది. రాజూ మంత్రీ మొదటి శిల్పి గదిలోనికి వెళ్లారు. గోడమీది శిల్పాన్ని చూచారు. చేతిలో రక్తపాత్రా, మెడలో పుఱ్ఱెలమాలా, కాళ్ల క్రింద రాక్షసుల దేహాలూ, ఇతర హస్తాల్లో అనేకాయుధాలూ, కళ్లల్లో విశేషించిన క్రౌర్యమూతో జూలు విదిల్చిన సింహం మీద కూచుని 'దాదాపు మీదికి దూకుతోందా ?' అన్నంత భయంకరంగా కాళికాదేవి శిల్పం కన్పించింది. ఇంత శిల్పాన్ని ఇంత అర్థవంతంగా రమణీయతమంగా ఇంత తక్కువ కాలంలో చేసిన కారణంగా 'ఇతనికే ఉత్తమ శిల్పి పదవిని ఈయవలసింద'న్నాడు రాజు.

మంత్రి రాజుని వారిస్తూ 'రెండవ శిల్పి శిల్పాన్ని చూచాక నిర్ణయించా' లన్నాడు. మధ్యలో ఉన్న చెక్కగోడని తొలగించారు. అద్భుతం! ఆశ్చర్యం ! సరిగా అటు గోడమీద వేయబడిన శిల్పమే ఇక్కడా వేయబడింది. ఏ మాత్రమూ భేదం లేదు. ఈ రెండవ శిల్పం మొదటి శిల్పి శిల్పాన్ని మించి కన్పిస్తోంది. ఇద్దఱూ ఒకే శిల్పాన్ని కనీసం ఒకరికొకరు సంప్రదించుకోకుండా నైనా ఎలా వేసారో రాజుకీ మంత్రికీ అక్కడివారికీ కూడా అర్థం కాలేదు.

అయినా ఉత్తమ శిల్పిని నిర్ణయించాలి కాబట్టి ఈ ఆలోచనలని మాని, రాజు 'రెండవశిల్పినే ఉత్తమునిగా నిర్ణయించా' నన్నాడు శిల్ప రామణీయకాన్ని చూచి. వెంటనే రాజు తన మెడలోని వజ్రాలనగని ఆతని మెడలో వేయబోతూంటే, రెండవ శిల్పి రాజు పాదాల మీద పడి 'రాజా! ఉత్తముడు ఆశిల్పియే. నేను కాదు. ఆ బహుమతిని అతడికే ఇయ్యండి. ఎందుకంటారా? ఆ శిల్పంలోని రామణీయకం మొత్తం ఎలా నా గోడమీద ప్రతిబింబించి ఆ శిల్పం కంటె గొప్పదిగా నాశిల్పం ఉండాలో అంతగా ఈ గోడని ఈ నెలరోజుల పాటు విపరీతంగా నునుపు చేసి దాదాపు అద్దంగా మార్చాను. ఈ నునుపు దనం మిమ్మల్ని కూడ మోసగించింది. మన్నించండి' అన్నాడు.

రాజు కళ్లలో ఆనంద బాష్పాలు వెలిసాయి. శిల్పి పనితనంలోనే కాక మానసికంగానూ ఉత్తముడే అని నిర్ణయించి ఆ వజ్రాల హారాన్ని మొదటి శిల్పికిస్తూ 'ఉత్తముని' గా నిర్ణయించి, ఆ శిల్పితో సమానంగా కాక అతనికి

మించేలా తానుండే విధంగా బుద్ధిబలాన్ని చూపిన రెండవ శిల్పిని కూడా 'ఉత్తముని' గానే నిర్ణయిస్తూ వేటొక వజ్రాల హారాన్ని ఇతడికి బహుమతిగా ఇచ్చాడు రాజు.

ఇక్కడ గమనించాల్సిందొకే విషయం. శ్రీమద్వాల్మీకి రామాయణం, వ్యాస భారత భాగవతాలూ మనకి ఉన్నాయి. ఆ రచయితలందరూ మహర్షులు. వారంతా మొదటి శిల్పికోవకి చెందినవారు. వాటికి వ్యాఖ్యలనీ అంతరార్థాలనీ వ్రాసి వాటి మూలభావం చెడిపోకుండా లోకానికి ప్రచారం చేస్తూ, మూలఋషుల కంటె గొప్పవారుగా ప్రశంసింపబడుతూన్న ఈ వ్యాఖ్యాతలంతా రెండవ శిల్పికోవకి చెందినవారే.

అయితే ఇక్కడే ఒక విషయం ఉంది. రెండవ శిల్పి ఎలా ఆ ప్రతిభ తనది కాదన్నాడో, ఆ ప్రతిభ మొదటివానిదే అన్నాడో, అలా అనడం నేటి వారి కర్తవ్యం. అలా కాక పూర్వుల కంటె మేమే ఘనులమని ఎవరైనా చాటిదే అది ద్రోహమే ఔతుందని వేఱే చెప్పాలా ?

కాబట్టి పూర్వుల గ్రంథాలు కాక కొత్తగా రాయాల్సినది ఏమీలేదనీ, వాటిని అర్థం చేసుకునేలా బుద్ధిని నునుపు చేసుకుంటే చాలనీ, అలాటి బుద్ధిని పరమాత్మ అయిన సారథి అంటే 'మన శరీర రథాన్ని నడుపుతున్నవాడు' ఈయాలనీ ప్రార్థించాలన్నమాట.

## 24. 'అమరుడు నిజంగా అ-మరుడే'

సంస్కృతభాషకే కాదు ఏ భాషకైనా నిఘంటువనేది అత్యవసరం. ఇక సంస్కృత భాష విషయానికి వస్తే సంస్కృతంలో ఎన్నెన్నో నిఘంటువులున్నా అమరుడు వ్రాసిన 'నామలింగానుశాసనమ్' అనే ఈ నిఘంటువుని మించింది లేనే లేదు. పేరుకి నామలింగానుశాసమే అయినా అందఱూ ఆ నిఘంటువుని 'అమరం' లేదా'అమరకోశం' (అమరుడనేవాడు వ్రాసిన నిఘంటువు) అనే అంటారు. 'అమరకోశం' అనడానికి వెనుక ఒక విషాదగాథ ఉంది.

పూర్వకాలంలో పండితులు బౌద్ధులనీ బౌద్ధేతరులనీ రెండు తెగలైపోయారు. రోజూ భిక్షాన్నాన్ని తెచ్చుకుని ఎక్కడో ఆరామాల్లో కూచుని, 'చదువే తమలోకంగా' జీవనాన్ని సాగించి లౌకిక ప్రపంచానికి చాల దూరంగానూ యజ్ఞయాగాదులకి అతి సమీపంగానూ జీవనాన్ని చేసినవారు బౌద్ధులు.

ఇక లౌకిక జీవనాన్ని కొనసాగిస్తూ, యజ్ఞయాగాదుల వలన తమకెంత ద్రవ్య వినియోగం జరుగుతుందా ? అనే ఒకింత ఆలోచనతో ఉండేవారు బౌద్ధేతరులు. ఈ కారణంగా ఒకరికొకరికి పడేది కాదు. ఎప్పటికప్పుడు బౌద్ధులని అవమానించడమే పనిగా పెట్టుకునేవారు బౌద్ధేతరులు.

ఇలా ఉండగా కొన్నాళ్ళికి బౌద్ధేతరులకి ఒక దుర్బుద్ధి పుట్టింది. రాజాస్థానంలో ఉన్న బౌద్ధులకారణంగా తమ పేరు ప్రఖ్యాతులకి కొంత తక్కువదనం రాసాగింది. ఈ తక్కువదనం పోవాలంటే బౌద్ధులని పూర్తిగా రాజాస్థానం నుండి తొలగించే ఉపాయాన్ని వెదకాలి. అంటే రాజుకి వీరిమీదా, వీరి పాండిత్యం మీదా నమ్మకం సడలడం గాదు- పూర్తిగా పోయేలా చేసి వీరి 'పీడ వదిలించుకోవా' లని బౌద్ధేతరులనుకున్నారన్నమాట.

అంతే! క్రమంగా ఒక పథకం ప్రకారం రాజు చెవి వద్దకి చేరి మెల్లగా బౌద్ధులకి చదువురాదనే విషయాన్ని పనిగట్టుకొని లేనిపోని ఉదాహరణలని సృష్టించి చెప్పసాగారు. మొదట్లో రాజు కొట్టిపారేసాడు. కొంతకాలమయ్యాక 'నిజమా?' అని అన్నాడు. 'ఇక ఉభయులబాధా పడలేక మఱి కొంతకాలానికి 'సత్యాసత్యాలు' తేలవలసిందే!' అన్నాడు. బౌద్ధుల జ్యోతిష పాండిత్యంలో పరీక్ష పెట్టాలని నిర్ణయించాడు రాజు.

నిర్ణయం ప్రకారం బౌద్ధులూ బౌద్ధేతరులూ ఎదురుబదురు ఆసనాల్లో రాజసభా భవనంలో కూర్చుని ఉన్నారు. రాజుకి ఆంతరంగికుడైన మంత్రి, ఎవరూ లేకుండా తానే ఒంటరిగా వెళ్లి ఈతకొలనులోని ఒక కప్పని ఎగరకుండానూ అఱవకుండానూ దారాలతో కట్టి ఒక కుండలో పెట్టి మూతపెట్టి సభాభవనానికి తెచ్చి రాజు ముందుంచాడు.

'ఈ కుండలో ఏముందో చెప్పగలిగితే వారిని నిజమైన పండితులుగా నేను గుర్తిసా' నని రాజు సభాముఖంగా ప్రకటించాడు. బౌద్ధులంతా ఒకేచోట చేరి ఆ కుండ వచ్చిన సమయం, రాజు ప్రకటన చేసిన సమయం ఆధారంగా లెక్కలని కట్టి ఏకగ్రీవంగా 'ఘటే మండూకో బద్ధో Z స్తి' (కుండలో గట్టిగా బంధింప బడిన కప్ప ఉంది) అని నిర్ణయించి ఆ విషయాన్నే ఒక తాటాకు మీద రాసి సరహస్యంగా రాజుకి సమర్పించేసారు సభలో.

ఇక బౌద్ధేతరులు లెక్కలని కట్ట ప్రారంభించారు. ఎన్నెన్నో తాటాకులు అయిపోతున్నాయి గాని లెక్కలకి అంతూపొంతూ లేకుండా పోతోంది. రాజిచ్చిన సమయం దాటిపోతోందనే భయం ఆందోళనా వీరికి ఎక్కువ కాసాగాయి. 'సమయం గాని దాటిందా ! బౌద్ధులే పండితులనే విషయం రూఢి అయిపోవడమే కాక, ఇంతవరకూ తాము చెప్పినవన్నీ 'చాడీలే' అనే విషయం స్పష్టమైపోతుంది. అదీ కాక ఇక జీవితంలో తమకి అస్తిత్వం అనేది ఉండదు ...' ఇలా ఆలోచించు కుంటూ దీనాతి దీనంగా ఒకరినొకరు చూసుకోసాగారు బౌద్ధేతరులు. 'ఇలాటి పరీక్ష' ని రాజు పెట్టబోతాడని చూచాయగా వీరికి తెలిసినా మరో విధంగా ఆ పరీక్ష స్వరూప స్వభావాలని మార్చేసి ఉండేవారే.

అంతలో వీరిలో ఒకడికి ఒక దురాలోచన వచ్చింది.'మిత్రమా! కుండలో ఏముందో మనకి తెలియదు. కాని, కుండలో ఏమున్నా 'శయనించిన శ్రీరంగేశ్వరస్వామి ఉన్నా'డనే విధంగా లోపలి వస్తువుని మార్చే మంత్రశక్తి నాకుంది. అయితే ఆ మంత్రాన్ని చదివి అక్షతలని వేసేప్పుడు ఆ అక్షతలు కనిపిస్తాయి. కాబట్టి బౌద్ధులు గాని, రాజుగాని అభ్యంతరాన్ని చెప్పవచ్చు. ఆ అక్షతల విషయం మీరు చూసుకుంటే ఇంతవరకూ నేను సహాయం చేయగల'నన్నాడు ఒక బౌద్ధేతరుడు.

ఆ మాటలని వింటూనే మరొక పండితుడు 'అసలు నాకు వచ్చిన విద్యే అది. ఏ వస్తువునైనా కనికట్టుతో కన్పించకుండా చేయగల'నన్నాడు. అందరూ తృప్తిగా ఒకటై ఆ పథకాన్ని ప్రయోగించాలనే నిర్ణయానికి వచ్చి అలాగే చేసి 'ఘటే శేషశాయీ శ్రీరంగేశో వర్తతే' (నిద్రిస్తూన్న శ్రీరంగనాయకస్వామి ఈ కుండలో ఉన్నాడు) అని రాసి ఆ తాటాకుని అందిచ్చారు రాజుకి.

రాజు ఆ రెండు తాటాకులనీ మంత్రికిస్తూ 'మంత్రీ ! ఇది చాల కష్టసమయం మన సామ్రాజ్యానికి. కారణమేమంటే ఎవరు ఈ పోటీలో ఓడిపోతే వారి తలలని నరుకవలసిందని నిర్ణయించి అందుకు సిద్ధపడి పోటీకి వచ్చారు కాబట్టి. ఎంత వద్దని చెప్పినా ఈ ఉభయపక్షాలలోని పండితులూ వినిపించుకోలేదు. ఇంతకీ ఈ లోపల ఉన్న వస్తువుని బట్టి ఈ పండితుల జీవితాలు ఉండడమో పోవడమో తేలుతుందంటే, ఖడ్గం పట్టి యుద్ధం చేస్తూ ఎందరినో యమపురికి పంపిన నాకే ఎందుకో మనస్కరించడం లేదు' అన్నాడు.

మంత్రి తాటాకులని రెంటినీ తీసి క్రమంగా ఒకటి పిమ్మట ఒకటి చదివి ఆ మీదట బౌద్ధేతరుల ముఖాలని జాలిగా చూస్తూ లోపల తానే కప్పని పెట్టిన కారణంగా 'కప్ప ఉంటుంది గదా !' అని భద్రంగా తీయబోతే 'నిద్రిస్తూన్న శ్రీరంగనాయకుని బొమ్మ' పైకి వచ్చింది.

మంత్రి క్షణకాలం అవాక్కైపోయాడు. బౌద్ధులు నిశ్చేష్టులైపోయారు.

బౌద్ధేతరులు చప్పట్లు చరుస్తూ 'బౌద్ధుల తలలని ఖండించాలి' అని అఱవడం ప్రారంభించారు. బౌద్ధులు ఓడారనగానే ఎందుకో దుఃఖంతో గొంతు పూడిపోయి మాట రాలేదు రాజుకి.

కాసేపటికి సద్దుమణిగింది. బౌద్ధేతరులు మళ్లీ లేచి 'రాజా! నిర్ణయం ప్రకారం వధ ప్రారంభం కావలసిందే ! ' అన్నారు.

మంత్రి లేచి 'రాజా! ఇందులో ఏదో మోసముంది. స్వయంగా నేను ఈతకొలనికి వెళ్లి, కప్పని అఱవకుండా ఎగురకుండా కట్టించి లోపల పెట్టి మీ ముందుంచాను. ఇందుకు సాక్ష్యం ఇదుగో 'మీ వెనుక ఉన్న గదిలో బందీగా ఈ పోటీ అయ్యేంతవరకూ ఉంచిన ఈ ఈతకొలను కాపలావాడు సాక్ష్యం. అతనే కట్టి దీనిలో పెట్టాడు' అంటూ ఆ తలుపు తీసి అతణ్ణి పిలిచి నిజం చెప్పమనగానే అతడు కప్ప విషయాన్నే చెప్పాడు.

దానికి బౌద్ధేతరులు అభ్యంతరాన్ని తెలుపుతూ 'రాజా ! బౌద్ధులంటే ఉండే పక్షపాత బుద్ధితో మంత్రి ఆడుతున్న విచిత్రమైన నాటకం ఇది. మమ్మల్ని బలవంతానా ఓడించాలనే అభిప్రాయం, మీకు మీ మంత్రి పుంగవులకీ ఉందని తెలిస్తే అసలు ఈ పోటీకి మేం సిద్ధపడేవాళ్లమేకాదు. ఇంతకీ వధ కార్యక్రమం వద్దని మీరనేటట్లయితే మాకూ సంతోషమే కాని, అదే మేమే తప్పు చెప్పి ఉన్నట్లయితే వధని వాయిదా వేసి ఉండేవారా?

అదీ కాక రాజులే ధర్మనిర్ణయాన్ని తప్పితే ఇక మాబోటు లెంత? అయినా స్పష్టంగా కళ్లముందు శ్రీశేషశాయి కన్పిస్తూంటే 'కప్ప' అని మంత్రి గారనడం, 'పిల్లికి ఎలక సాక్ష్యం' అన్నట్టు ముందుగానే ఓ కాపలావాణ్ణి తెచ్చి సిద్ధంగా ఉంచి , అందఱి ముందుకీ ఈ సమయంలో బహిరంగంగా దానికో సాక్ష్యాన్ని తేవడం చూస్తుంటే ... ఇదంతా, ముందుగానే వేసుకున్న పథకంలా తోస్తోంది. ... ' అంటూ పెద్ద ఎత్తున వివాదాన్ని లేవదీసారు.

రాజు ఏమీ మాట్లాడలేక మంత్రిని చూసాడు. మంత్రి తలదించుకున్నాడు. ఈతకొలను కాపలాదారు, బౌద్ధేతరులకి తాను చెప్పేది యథార్థమంటూ వందల పర్యాయాలు చెప్తుండడం కనించింది. సభమొత్తం కలకల మంటూ ఎవరేం మాట్లాడుతున్నదీ తెలియకుండా అయిపోయిన దశలో బౌద్ధపండితులలో ప్రధానుడు లేచాడు.

'రాజా! కుండ తెచ్చిన సమయం, తాము ప్రకటించిన సమయం ఆధారంగా జ్యోతిషశాస్త్రాన్ని బట్టి కుండలిని వేసి పరిశీలిస్తే ఏ మాత్రపు జ్యోతిష శాస్త్ర పరిచయం ఉన్నవానికైనా కుండలో జలచరం ఉన్నదనే విషయం అర్థమయి తీరుతుంది. మేం మరికొంత నైపుణ్యాన్ని కలవాళ్లం కాబట్టి జలచరాల్లో 'కప్ప' గా దాన్ని గుర్తించగలిగాం. ఏ శాస్త్రం ప్రకారం, ఏ శ్లోకాల ఆధారంగా ఎలా నిర్ణయించామో వివరంగా చెప్తాం. తాము సమయాన్ని ఈయవలసిందిగా ప్రార్థిస్తున్నాం. ఇక బౌద్ధేతరులు ఏప్రమాణం ఆధారంగా ఏ శాస్త్రాధారంగా శేషశాయినిగా నిర్ణయించారో చెప్తే వినడానికి సిద్ధంగానూ ఉన్నాం. నిర్ణయం ప్రకారం వధింపబడడానికి అర్హులమే అయినా చివరికోరికగా మా మనవిని పరిశీలింప ప్రార్థిస్తున్నాం' అన్నాడు ఆ బౌద్ధపండితుడు.

దానికి ఒక్కుమ్మడిగా బౌద్ధేతరులంతా అభ్యంతరాన్ని తెల్పుతూ 'రాజా!శాస్త్రం రహస్యమైనది. మేం ఏ ప్రకారంగా శాస్త్రాన్ని చదివి ఫలితాలని చెప్తున్నదీ, తాము ఏ ప్రకారంగా చెప్పలేకపోతున్నదీ అర్థం చేసుకొనేందుకు బౌద్ధులు పన్నుతూన్న పన్నాగమిది. మీరు మాట తప్పి 'వధించబోను' అనండి. మేం ఇటునుండి ఇటే దేశం విడిచి వెళ్లిపోతాం' అన్నారు ఏకగ్రీవంగా.

చేసేది లేక రాజు, తలారిని పిలిచాడు. బౌద్ధులంతా వరసగా నిలబడి తమ బుద్ధదేవుణ్ణి ప్రార్థించ సాగారు. మొదట్లో నామలింగానుశాసనాన్ని వ్రాయదలచిన అమరుడే ఉన్నాడు. తలారి నరకడానికి రాగా 'నాయనా! నేను లోకానికి అందించదగిన ఒక మహాగ్రంథం మిగిలిపోయింది. నేనెటూ పారిపోను. మరణానికి భయపడను. అటునుండి నరుక్కు రా !' అని ప్రార్థించాడు అమరుడు. ('అటునుండి నరుక్కురా' అనేమాట ఆ కాలం నాటిదన్నమాట)

వధ ప్రారంభమైంది. హాహాకారాలు మిన్నుముడుతున్నాయి. రక్తం చిందుతోంది. 'తనరాజ్యం నాటితో సరి' అని రాజు భావిస్తున్నాడు. అమరుడు గంటాన్ని పట్టి తాటాకుల మీద వేగంగా నామలింగాను శాసన గ్రంథాన్ని వ్రాయడం ప్రారంభించి, ఒకే ఒక్క బిగిని సూర్యాస్తమయ వేళకి గ్రంథాన్ని ముగించాడు.

అప్పటివరకూ వధ సాగుతూనే ఉందన్నమాట. ఆ దుఃఖంలో బుద్ధుణ్ణి తలుచుకుని రాసిన ఆ గ్రంథాన్ని రాజుచేతిలో ఉంచుతూ 'రాజా! ఇప్పటికీ చెప్తున్నాను. ఇది బౌద్ధేతరుల కపటోపాయమే. నీ జీవితం జాగ్రత. అవకాశముంటే ఈ గ్రంథాన్ని ప్రచారంలోనికి తేవలసిందిగా కోరుతున్నా' నన్నాడు.

రాజు ఆ గ్రంథాన్ని చూచి అక్కడక్కడ చదివి ఎనలేని నిఘంటువుగా దాన్ని గుర్తించి 'ఇతణ్ణి వధించవ'ద్దని తలారిని ఆదేశించాడు. 'నా వారంతా పోయాక నేనుండడమా?' అనంటూ అమరుడు అందఱూ చూస్తుండగా తన గంటంతో కుత్తుకలో పొడుచుకుని కాలం చేసాడు. ఆ 'అమరం' లేనిదే సంస్కృతభాషే లేదు కాబట్టి అమరుడు ఎప్పటికీ 'అ-మరుడే'.

ఇలా ఎందరెందఱో సంస్కృత కవులు, పండితులు, నిఘంటు కర్తలు ... విషాదాత్మక జీవితాన్ని గడిపిన వారుగా కన్పిస్తారు.

మన బాగోగుల నిమిత్తమై మన తలిదండ్రులెన్నో కష్టాలని పడితే మనం వాటన్నింటినీ కళ్లనిండునీళ్లతో గుర్తు చేసుకుంటూ అశ్రుతర్పణాన్ని విడుస్తూ, అలాటి కష్టం మన పిల్లలకి కలగకుండా చేయాలని ప్రయత్నిస్తున్నామా ? లేదా ?

అలాగే మహానుభావులైన ఆ పూర్వ సంస్కృత కవుల పండితుల ఆత్మకు శాంతి కలగాలంటే కనీసం వారిని గూర్చి ఇలా స్మరించుకోవడమైనా చెయ్యాలి.

వారిగ్రంథాలని చదివే తీరుబడీ ఓపికా లేకపోయినా కనీసం వారి జీవిత కథనైనా అనుకోగల్గితే ఆ మహర్షులవంటి కవుల దివ్యాశీస్సులు మన వంశానికి లభిస్తాయి.

ఈ కథలని ఇలా చదువుతూ చదివిస్తూ మన కాలం వారందఱికీ చేరుద్దాం.

ఇలా చేర్చిన కారణంగా గురు ఋణం నుండి విముక్తుల మౌదాం.

తాత ముత్తాతలా తలిదండ్రులా ఆస్తులతోపాటు ఆ నాటి వారి సంప్రదాయాలనీ, ఇలాటి పనికొచ్చే శ్లోక కథలనీ కూడ అందజేద్దాం. అనగనగా .... అంటూ చెప్పుకుందాం.

-- స్వస్తి ప్రజాభ్యః --

శరత్కాలపు మేఘం వెన్నెలని వడకట్టి నేలమీదికి పంపుతూంటే,
ఆ చల్లని వెన్నెలని మించిన 'చల్లని అమ్మ' మంచి కథ చెప్తూంటే,
అమ్మ కళ్లలోకి కళ్లు పెట్టిచూస్తూ,
అమ్మ చెప్పే కథలో
'తరవాత ఏం జరుగుతుందో' అనే ఉత్కంఠతో కళ్లని మరింత పెద్దవి చేస్తూ,
అమ్మపెట్టిన అమృతమయమైన అన్నం ముద్దని గుటుక్కున మింగుతూ,

అని అడగని బిడ్డడు దేశంలో ఉండడు !
నిజమే మరి ! అమ్మకి ఎన్ని కథలొచ్చు ?
అమ్మకి వాళ్లమ్మ చెప్పినన్ని కథలా ? సరే!
మరి ఆ అమ్మమ్మకి ఎన్ని కథలొచ్చు?
ఆ అమ్మమ్మకి వాళ్ల అమ్మ చెప్పినన్ని కథలా ?
....... ఇలా వెనక్కిపోతే ఈ కథలన్నింటినీ ఎవరు చెప్పారట ? ఎక్కడ ఈ కథల గని ఉందట ?
ఆ గని ఎక్కడో కాదు. మరేమో కూడా కాదు.
ఆ గని "ప్రాచీన శ్లోకాలే".
ఒక్కో కథ మనకి నిత్యం గుర్తుండేందుకు వీలుగా ఒక్కో శ్లోకాన్ని ప్రాచీనులందించారు. ఆ శ్లోకం చదివినప్పుడల్లా ఆ కథ శిలాశాసనంలా మనచేత తన చరిత్రని నెమరు వేయించుకుంటూంటుంది.
ఇలాంటి ప్రాచీన శ్లోకాల వెనుకదాగిన ఇరవైనాలుగు కథల సంపుటి మీ చేతిలో ఉంది. ఆలస్యం దేనికి ! అరగించండి !!
మానసికారోగ్యానికి ఔషధం ఈ కథా రసాయనం.
**చిరంజీవి కందికుప్ప సాయి శివనారాయణ స్మృతికి సంకేతం.**

ప్రతులకి :
[illegible]
**5-21-37, 2/6 బ్రాడీపేట, గుంటూరు-2. ఫోన్ : 354611.**